శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే కూరనాథాయ నమః



కూరేశ ప్రణీతము

# శ్రీస్తవము

## భావనావ్యాఖ్యానము

పండితరత్న, వేదాంతవాచస్పతి

**డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీకూరత్తాళ్వాన్ సహస్రాబ్దిమహోత్సవ జ్ఞాపిక

**2010**

# కూరేశప్రణీతము - **శ్రీస్తవము**

**భావనావ్యాఖ్యానము**

**డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**



ద్వితీయ ముద్రణ - విరోధి - మకరం - హస్త

ఆవిష్కరణము - శ్రీకూరత్తాళ్వాన్ సహస్రాబ్ది మహోత్సవ సందర్భంగా

వేదిక - శ్రీ కూరత్తాళ్వాన్ సన్నిధి, శ్రీకూరం

ప్రతులు - 500

మూల్యము - రూ. 15/-

ముఖచిత్రము : నమ్బెరుమాళ్ళు, శ్రీరంగనాయకి (శ్రీరంగము)

ఈ గ్రంథము ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల శ్రీనివాసాచార్యస్వామివారి (పుల్లూరు గ్రామం, మెదక్ జిల్లా) శిష్యులచే వారి కైంకర్యరూపంగా శ్రీరామానుజసిద్ధాంత సభ, హైదరాబాద్‌వారిద్వారా ముద్రింపబడుతున్నది.

ప్రతులకు : 1) శ్రీమతి ఈ. జయలక్ష్మి
18-3-57/7, శాంతినగర్, కె.టి.రోడ్, తిరుపతి-517 507
ఫోన్ : (0877-2232091), 09885003420

2) శ్రీస్వామిదాస్
8-1-282/1, శివసాయి రెసిడెన్సీ, ఫ్లాట్ నెం.25,
రెండవ అంతస్థు, డొక్కలమ్మ దేవాలయం దగ్గర
శివాజి నగర్, సికింద్రాబాద్-500 003
ఫోన్ : 09440090324

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



# ప్రాక్నివేదనము

సంస్కృతస్తోత్రవాఙ్మయ కల్పవృక్షములో శ్రీ వైష్ణవస్తోత్రశాఖ చాల విస్తృతమైనది; విశిష్టమైనదియును. పరమవైదికమగు విశిష్టాద్వైతసిద్ధాంతానుసారము పరమాత్మ తత్త్వము లక్ష్మీవిశిష్టమగుటచే, వేదకాలమునుండి ఆ పరమాత్మను స్తుతించుచు వెలువడిన స్తోత్రములో పలు సందర్భములందు ప్రాసంగికముగా లక్ష్మీస్తుతులును చోటుచేసికొనుట సహజము. పరమాత్మ విశ్వరూపమును వర్ణించు పురుషసూక్తములో చివరగల **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** అను సూక్తి ఇందులకు ఒక ఉదాహరణము. ఈ విధముగా ప్రారంభమైన లక్ష్మీవైభవము క్రమముగా ప్రత్యేకస్తుతుల రూపములందును గోచరించినది. మేధాసూక్త, శ్రీసూక్తాదులిట్టివే. తదనంతరకాలమున విలసిల్లిన ఇతిహాసపురాణములలో పాంచరాత్ర, వైఖానసాది ఆగమగ్రంథములలో లక్ష్మీదేవివైభవతత్త్వము మరింత విస్తృతముగా స్తుతుల రూపమున ప్రదర్శింపబడినది. **"శ్రీమద్రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే"** అనుచు పరాశరభట్టర్ శ్రీరామాయణము సైతము లక్ష్మీవైభవమందే పర్యవసించుచున్నదనిరి. ఈ లక్ష్మీదేవి అణు స్వరూపిణి, జీవులకు ఉపేయభూత, భగవానునకు అనురూపయైన పత్ని, సమస్తసంపదకు, సకలవిధమంగళవస్తువులకును ప్రతీక, భగవానుడగు నారాయణునితో ఎల్లప్పుడు కలసియుండునది (నిత్యానపాయిని), హిరణ్యవర్ణ, సమస్తగుణములను కల్గినది, దయాస్వరూపిణి, ఏ దోషమును లేనిది, సర్వలోకైకమాత, సృష్టిస్థితిసంహారాది కార్యములందు భగవానుని వెన్నంటియుండునది, శరణాగతుని పరమాత్మ తప్పక రక్షించునట్లు పురుషకారమును చేయునదియును. లక్ష్మీదేవివలెనే భగవానునకు భూనీళాదిపత్నులు పలువురు ఉన్నను, లక్ష్మీదేవికిని, వీరికిని మధ్య ఎట్టి వైరస్యమును లేదు. వీరందఱిలో లక్ష్మీదేవి ప్రధానురాలు. మిగిలిన వారీమెకు అంగములవంటివారు. **"ఛాయా మివాభ్యుదయినీ మవనీమ్"** అన్నట్లు ఈమెను వారు ఛాయవలె అనుసరింతురు. ఈ రీతిలో లక్ష్మీవైభవము ఇతిహాసపురాణాది వాఙ్మయములో ప్రపంచింపబడినది.

ఈ వైభవవిశేషములను అనుసంధించుచు దివ్యసూరులనబడు ఆళ్వార్లు విశిష్టాద్వైతసంప్రదాయమునకు చెందిన పలువురు పూర్వాచార్యులు - భగవద్యామున మునులు, భగవద్రామానుజులు, కూరేశులు, పరాశరభట్టర్, వేదాంతదేశికులవంటివారు పలు అద్భుతములైన లక్ష్మీస్తుతులను వెలయించిరి. వానిలో కూరేశకృతమగు ఈ శ్రీస్తవమొకటి. ఇది పంచస్తవిగా పేరొందిన అయిదు స్తుతులలో చివరిది.

పంచస్తవిని కూరేశులు రచించిన క్రమము విషయమున ఆచార్యులలో కొంత అభిప్రాయభేదమున్నట్లు కన్పించుచున్నది. శ్రీవైష్ణవగురుపరంపరాక్రమమునుబట్టి ముందు

లక్ష్మీస్తుతిని, ఆ పిమ్మట భగవానుని స్తుతింపవలెను. కావున, కూరేశులీక్రమమును అనుసరించుచు పంచస్తవిని అనుగ్రహించియుండవచ్చునని తలచిన కొందఱు దీనిని మొదటి స్తుతిగా పరిగణించుచున్నారు. కాని, కూరేశుల స్తోత్రములైదింటిలో శ్రీవైకుంఠ స్తవము మొట్టమొదటిది అను విషయమును సంప్రదాయము, చరిత్రయును నిరూపించు చున్నవి. పలువురు అభిజ్ఞులు శ్రీస్తవమును చివరి స్తుతిగానే లెక్కించిరనుటను ప్రాతః స్మరణీయులు, సమీపకాలమున ఉత్తమశ్లోకులు, పరమప్రామాణికులును అగు మహావిద్వాన్ కాంచీ ప్ర.భ.అణ్ణాస్వామివారు తమ చతుఃశ్లోకీవ్యాఖ్యానారంభములో – **"ఇవర్ తామ్ స్తోత్రరత్నమ్ అరుళిచ్చెయ్దు తలైక్కట్టిన అనంతరమ్ ఇన్ద స్తోత్రత్తై అరుళిచ్చెయ్దారెన్రు పెరియోర్ పణిక్కుమ్బడి. ఆళ్వానుమ్, శ్రీ వైకుంఠస్తవాదికళ్ నాన్గుమ్ అరుళిచ్చెయ్ద అనంతరమే శ్రీస్తవమరుళిచ్చెయ్దార్. భట్టరుమ్ శ్రీరంగరాజస్తవ మరుళిచ్చెయ్ద పిన్బే శ్రీగుణరత్న కోశమరుళిచ్చెయ్దార్. ఆచార్యవన్దనాది మంగళా చరణఙ్గళ్ స్తోత్రరత్నోపక్రమత్తిలే కాణ్గైయాలుమ్, అదువే ఆద్యస్తోత్రమాక అఱుదియిడ ప్పెరుమ్. ఆశ్రయణవేళైయిలే పిరాట్టియై మున్నమ్ పణిన్దు, పిన్నై ఎమ్బెరుమానై ప్పణికిన్ఱోమానాలుమ్, స్తోత్రప్రక్రియైయిలే ఇన్ద క్రమవివక్షై ఆచార్యర్కళుక్కు ఇరున్దదిలై"** అని పల్కుటచే ఈ శ్రీస్తవము చివరిది అనుట నిర్వివాదము.

భగవానునివలెనే, లక్ష్మీదేవియును పరవ్యూహ, విభవ, అంతర్యామి, అర్చలనెడి అయిదు రూపములను కల్గియుండునని శాస్త్రములలో తెలుపబడినది. ఈ స్తుతిలో కూరేశులు **"విణ్ణవర్కోన్ విరైయార్ పొழిల్ వేఙ్గడవన్"** అనుచు ఆళ్వార్లు అనుసంధించిన క్రమముగా అనుసరించుచు లక్ష్మీదేవియొక్క పర – అర్చారూపముల మధ్య ధర్మైక్యమును అనుసంధించుట విశేషము. ఎట్లనగా – **"స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతామ్ . . . . ."** ఇత్యాదిగా లక్ష్మీదేవియొక్క పరరూపమును స్తుతిప్రారంభమున ప్రస్తుతించిన కూరేశులు చివరలో **"శ్రీరంగరాజమహిషీ సా మా మపి వీక్షతామ్ లక్ష్మీః"** అనుచు శ్రీరంగములోని శ్రీరంగనాయకికి, లక్ష్మీదేవికినిమధ్య సామానాధికరణ్యనిర్దేశముచేయుటద్వారా శ్రీరంగము నందు అర్చారూపమున వేంచేసియున్న లక్ష్మీరూపమునకు, పూర్వోక్తమైన పరరూపమునకు మధ్య అభేదము అనుసంధింపబడినది. ఈ క్రమమునే పరాశరభట్టర్ అనుసరించుచు శ్రీగుణరత్నకోశప్రారంభములో **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనమ్"** అనుచు పరరూప ప్రస్తావనను చేసి, వెనువెంటనే – **"ఉల్లాసపల్లవిత . . . . . . . . . శ్రీరంగరాజమహిషీం శ్రియ మాశ్రయామః"** అని పల్కిరికదా!

ఈ స్తుతి కేవలము 11 శ్లోకముల సమాహారమే అయినను, ఇది లక్ష్మీతత్త్వమును సమగ్రముగా, రమణీయముగా నిరూపించుచున్నది. ఉదాహరణకు – **"స్వస్తి శ్రీ ర్దిశతాత్"** అను ప్రారంభశ్లోకములో ఈమె భగవన్నిత్యానపాయిని అనుట, ఈమె పురుషకార స్వరూపిణి అనుటయును తెలుపబడుటద్వారా **"శ్రీయతే, శ్రీయతే"** అను శ్రీశబ్దవ్యుత్పత్తులు రెండును తెలుపబడుటయే కాక, అర్థతః **"శ్రుణోతి, శ్రావయతి"** అను వ్యుత్పత్తులును సూచింపబడినవి అని చెప్పవచ్చును. ఈ స్తవములోని పలు భావములను అనంతరకాలీను లగు పలువురు ఆచార్యులు తమ స్తుతులలో అనుసంధించుటయును గమనింపవచ్చును. ఇందలి **"స్వస్తి శ్రీ ర్దిశతాత్"** అను మొదటి శ్లోకము పరాశరభట్టర్ రచించిన శ్రీగుణరత్న కోశములోని **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనమ్"** అను శ్లోకమునకు నిదానము. **"దేవి! త్వన్మహిమావధిః న హరిణా"** అనెడి సూక్తి భట్టర్ శ్రీగుణరత్న కోశములోని **"భోగోపోద్ఘాత కేళీచుళకితభగవద్వైశ్వరూప్యానుభావా"** **"దశశతపాణిపాద . . . ."** ఇత్యాది ప్రయోగము లకు, **"లోకే వనస్పతిబృహస్పతి తారతమ్యమ్"** అను సూక్తి **"యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే"** అనెడి భట్టర్ ప్రయోగమునకును మూలము. అట్లే **"యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన"** అను శ్రీస్తవ శ్లోకమును వేదాంతదేశికుల శ్రీస్తుతిలోని **"ఆలోక్య త్వా మమృతసహజే"** అను శ్లోకము అనుసరించినది. ఇట్టి విశేషము లింకను అనేకములున్నను విస్తృతిభీతిచే ప్రస్తావించుటలేదు. మఱియు ఈ శ్రీస్తవములోని శ్లోకములకు, దివ్యసూరుల సూక్తులకుగల సామ్యములు చాల ఉన్నను, అవి వ్యాఖ్యలో అచట అచట నివేదించుటచేతను, గ్రంథవిస్తర భీతిచేతను విడువబడినవి. స్తుతికర్తయగు కూరేశుల వాచామగోచర మహాగుణ వైభవము, పాండితీగరిమ– ఇత్యాద్యంశములు పలుగ్రంథములలో పలువురు పండితులచే ప్రస్తుతపూర్వములు. కావున పునరుక్తి అగునని నివేదింపబడలేదు.

ఇట్టి మహనీయమైన శ్రీస్తవమునకు సంస్కృతభాషలో, మణిప్రవాళమున, తెలుగులో పలు వ్యాఖ్యానములు వెలసినవి. సంస్కృతమున – శ్రీశైల శ్రీనివాసాచార్య వ్యాఖ్య, గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్య, వేంకటనివాసకృతమగు వేఱొక వ్యాఖ్యయును కలవు. వీనిలో శ్రీనివాసాచార్యవ్యాఖ్య బహుళప్రచారములో నున్నది, పలుమార్లు ముద్రింప బడినదికూడ. గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్య సుమారు 110 సంవత్సరములకు ముందు ఆంధ్రాక్షరములలో ముద్రింపబడినట్లు తెలియుచున్నది. ప్రస్తుతము దుర్లభము. వేంకట నివాస వ్యాఖ్య ఇంతవరకు వెలుగు చూడనేలేదు. జగదాచార్య సింహాసనాధిపతులగు కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి మణిప్రవాళవ్యాఖ్య సమీపకాలమున మిక్కిలి ప్రాచుర్యమును పొందినది, పలుమార్లు ప్రచురింపబడినదికూడా. ఈ వ్యాఖ్యాన విశేషములే ప్రధానముగా ప్రస్తుత భావనావ్యాఖ్యానములో కృతజ్ఞతాపురస్సరముగా అనుసంధింపబడినది. తెలుగు భాషలో కూడ ఒకటి, రెండు వ్యాఖ్యలున్నవి. కాని, దివ్యసూరుల సూక్తులను సమన్వయించి, రచింపబడిన వ్యాఖ్య ఏదియు వచ్చినట్లు కన్పింపదు.

నడయాడు పాతంజలం కీర్తింపబడు కూరేశులచేత ప్రణీతమైన ఈ గంభీరమైన స్తవమునకు అల్పజ్ఞుడగు దాసుడు వ్యాఖ్యానమును వ్రాయుట అత్యంతము సాహసమే. అయినను, ఆత్మీయ మిత్రమొకరు పదే పదే ప్రోత్సహించుటచే, వారిమాటను కాదనలేక, జగన్మాతయగు లక్ష్మీదేవి విషయమున యథాశక్తి వాచిక కైంకర్యమును చేసి, **"సంబంధాత్ స్వాత్మలాభః"** అను రీతిలో ఆత్మలాభమును పొందవలెనను ఆశతోనే ఈ వ్యాఖ్యాన ప్రయత్నము చేయబడినది. ప్రధానముగా కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానాంశములే ప్రస్తుతములైనను, అచట అచట కొన్ని విశేషములు యథామతి చేర్చబడినవి. ఇందలి గుణదోషములకు సహృదయహృదయములు ప్రమాణము.

శ్రీస్తవము భావనావ్యాఖ్యతోపాటుగా 2006వ సం॥లో ఒకమారు ముద్రింపబడి, సహృదయులైన పెద్దల మంగళాశాసనాలను నోచుకొన్నది. ఈ ఏడు కూరేశుల సహస్రాబ్ది మహోత్సవాలు సర్వత్ర జరుగుతున్న విషయం సర్వవిదితమే. కూరేశుల జన్మస్థానం అయిన కూరమనే దివ్యదేశంలో ఎంతో వైభవంగా ఈ మహోత్సవాలు నిర్వహింపబడే ఈ శుభసమయంలో ఈ శ్రీస్తవాన్ని భావనావ్యాఖ్యతో ముద్రించాలని, ఈ ప్రకాశనం కూడా తమ ఉత్తారకాచార్యులైన శ్రీ **ఉ.వే. శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల శ్రీనివాసాచార్య స్వామివారి (పుల్లూరు గ్రామం, మెదక్ జిల్లా)** విషయంలో వారి ముఖోల్లాసాన్ని కలిగించే పవిత్ర కైంకర్యరూపంగా **శ్రీరామానుజ సిద్ధాంతసభ, హైదరాబాద్ ద్వారా** చేయాలని సంకల్పించి, ఇందుకు అవసరమైన ఆర్థికభారాన్ని భరించిన ప్రపన్నులు, హైదరాబాద్ వాస్తవ్యులు **శ్రీమాన్ స్వామిదాస్‌గారు** సర్వథా అభినందనీయులు. వారి కైంకర్యశ్రీ నిర్విఘ్నంగా, మరింతగా కొనసాగాలని కోరుకుంటూ, ఆవిధంగా అనుగ్రహించ వలసిందిగా అస్మదారాధ్య దైవం శ్రీనివాసప్రభువును ప్రార్థిస్తున్నాను. ఇంతకుముందువలెనే ఈ భావనా వ్యాఖ్యను సహృదయపాఠకులు ఆదరిస్తారని నమ్ముతున్నాను. ఈసారి విశేషంగా గార్గ్యరామానుజాచార్యకృత సంస్కృతవ్యాఖ్యకూడా ఇందులో ముద్రింపబడింది. ఈ వ్యాఖ్య గతంలో ఒకసారి ముద్రింపబడిందని తెలిసినా, అది ఇపుడు పూర్తిగా అలభ్యం. సకాలంలో గ్రంథాన్ని పునర్ముద్రణకు సిద్ధం చేసిన మిత్రులు శ్రీచంద్రశేఖర్‌గారికి, సకాలంలో ముద్రించి ఇచ్చిన సి.యన్.ప్రింటర్స్ శ్రీహర్షవర్ధన్ నా కృతజ్ఞతాంజలులు.

**"స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతామ్"**

ఇట్లు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి,
27-3-06



**శ్రీకూరేశప్రణీతము**

# శ్రీస్తవము

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

**1.** స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః
స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః ।
యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్
క్రీడేయం ఖలు నాన్యథాఽస్య రసదా స్యాదైకరస్యా త్తయా ॥

**2.** హే శ్రీ ర్దేవి! సమస్తలోకజననీం త్వా స్తోతు మీహామహే
యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియమ్ ।
భక్తిం భందయ నందయాశ్రిత మిమం దాసం జనం తావకం
లక్ష్యం లక్ష్మి! కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీ వయమ్ ॥

**3.** స్తోత్రం నామ కి మామనంతి కవయో యద్యన్యదీయాన్ గుణాన్
అన్యత్ర త్వసతోఽధిరోప్య ఫణితిః సా తర్హి వంధ్యా త్వయి ।
సమ్యక్సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ
వాగ్వాచస్పతినాఽపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥

**4.** యే వాచాం మనసాం చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణా స్తావకాః
తానేవ ప్రతి సాంబుజిహ్వా ముదితా హై మామికా భారతీ ।
హాస్యం తత్తు న మన్మహే న హి చకోర్యేకాఽఖిలాం చంద్రికాం
నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి ॥

**5.** క్షోదీయా నపి దుష్టబుద్ధి రపి నిస్స్నేహోఽప్యనీహోఽపి తే
కీర్తిం దేవి! లిహ న్నహం న చ బిభేమ్యజ్ఞో న జిహ్రేమి చ ।
దుష్యే త్సా తు న తావతా న హి శునా లీఢాఽపి భాగీరథీ
దుష్యేత్ శ్వాఽపి న లజ్జతే న చ బిభేత్యార్తి స్తు శామ్యే చ్ఛునః ॥

6. ఐశ్వర్యం మహ దేవ వాఽల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్।
తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే ।
తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణో
ధన్యం మన్యత ఈక్షణా త్తవ యతః స్వాత్మాన మాత్మేశ్వరః ॥

7. ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌందర్యలావణ్యయోః
రూపం య చ్చ హి మంగళం కి మపి యల్లోకే స దిత్యుచ్యతే ।
తత్సర్వం త్వదధీన మేవ యదతః శ్రీరిత్యభేదేన వా
యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి ! ప్రథా మశ్నుతే ॥

8. దేవి! త్వన్మహిమావధి ర్న హరిణా నాఽపి త్వయా జ్ఞాయతే
యద్యప్యేవ మథాఽపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే ।
యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః
వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోఽయ మిత్యుచ్యతే॥

9. లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం
యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి ।
సా భారతీ భగవతీ తు యదీయదాసీ
తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః॥

10. యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన
సద్యః సముల్లసితపల్లవ ముల్లలాస ।
విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్
తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ॥

11. యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశాః స్యుః ।
శ్రీరంగరాజమహిషీ సా మా మపి వీక్షతాం లక్ష్మీః ॥





శ్రీమతే రామానుజాయ నమః



## శ్రీకూరేశప్రణీతము

# శ్రీస్తవము

## భావనావ్యాఖ్యానము

## కూరేశుల తనియన్

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

**శ్రీస్తవ మేనం శుభదమ్ లక్ష్మీవైభవనిరూపణసమర్థమ్ ।**
**వివృణోతి శింగరార్యః శ్రీకూరాధిపగురూత్తమప్రోక్తమ్ ॥**

**ప్ర.** అ-యత్+ఉక్తయః = ఏ కూరేశుల వచనములు, త్రయీ కంఠే = వేదమను స్త్రీయొక్క కంఠమున, మంగళసూత్రతాం = మంగళ సూత్రమగుటను, యాంతి= పొందుచున్నవో అట్టి, శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః = పూజ్యులైన శ్రీవత్సచిహ్నులకు, నమ ఉక్తిం = నమస్కార వచనమును, అధీమహే = పలుకుచున్నాము.

భట్టర్ సత్సంప్రదాయమును అనుసరించుచు, మొదటగా గురుపరంపరా వందనమును. ఈ శ్లోకముతో ప్రారంభించుచున్నారు. పరాశరభట్టరు, భగవద్రామానుజుల అంతరంగ శిష్యులలో ప్రథములు, **"రామస్య దక్షిణో బాహుః"** (రామునకు కుడిభుజము) (రా.ఆర.34-13) అనునట్లు వారికి కుడిభుజమై నిలచినవారును, జ్ఞాన, భక్తి, వైరాగ్య సంపన్నులును అగు శ్రీవత్సాంకుల (కూరత్తాழ్వాన్) పుత్రరత్నము. వీరు శ్రీరామానుజుల దివ్యకటాక్షమునకు పాత్రులై, వారికి పిమ్మట శ్రీవైష్ణవసంప్రదాయ ప్రచారభారమును అత్యంత సమర్థతతో నిర్వహించిరి.

**"వేదమ్వల్లార్ కళైక్కొణ్డు విణ్ణోర్పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు"** (తి.వా.4-6-8) (వేదవిదులగు ఆచార్యులను పురస్కరించుకొని పరమపదనాథుని పాదములను ఆశ్రయించి) **"భగవద్వందనం స్వాద్యం గురువందనపూర్వకమ్, క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః"** (ఆచార్యనమస్కారపూర్వమైన భగవద్వందనము భోగ్యము. చక్కెరతో కలిసిన పాలు మఱింతగా రుచిస్తాయి కదా!) అనే రీతిలో ఆచార్యముఖముగా భగవానుని

ఆశ్రయించుట సత్సంప్రదాయము. నిరపాయమైన విధానము. ఆ పద్ధతిలో భట్టరు మొదట ఆచార్యవందనమును చేయుచున్నారు. తనకు జన్మచే తండ్రి, విద్యచే ఆచార్యులగు శ్రీవత్సాంకమిశ్రులకు నమస్కరించుచున్నారు. భట్టరు సామాన్యశాస్త్రములనే కాక, తిరువాయ్‌మొழிవంటి దివ్యప్రబంధముల రహస్యార్థములను కూడ తమ తండ్రిగారి సన్నిధిలో తెలిసికొనిరని వీరి చరిత్ర తెలుపుచున్నది. విష్ణుసహస్రనామ వ్యాఖ్యానమగు **"భగవద్గుణదర్పణము"**న ప్రారంభములో భట్టరు **"వందే గోవిందతాతౌ"** అనుచు స్వాచార్యులగు గోవింద భట్టరును (ఎమ్బార్), శ్రీవత్సాంకులను నమస్కరించిరి. వేదకాంతకంఠమునకు తాళివంటి సూక్తులను అనుగ్రహించిన, పూజ్యులగు శ్రీవత్సాంకుల కెల్లప్పుడును నమస్కరింతుమము– అని శ్లోకభావము.

లోకమున వనితకు మంగళసూత్రము లేని దశలు రెండు. అందు మొదటిది – వివాహమునకు ముందు దశ. అనగా – కన్యకాదశ. రెండవది – భర్త మరణించిన పిమ్మట కల్గు వైధవ్యదశ. కన్యగానున్న స్త్రీకి వివాహమగువరకు పలువురు ఆమె తమ భార్య అయిన బాగుండునని తలంతురు. గృహస్థులు, విరక్తులును ఆమెను చూచి ఇంకను ఎవరి సొత్తు కాలేదని భావింతురు. ఆమెకు వివాహమై, మెడలో మంగళసూత్రమును దాల్చిన పిమ్మట, ఆ మంగళసూత్రమును చూచినవారు ఎవ్వరును ఆమె తన భార్యగా కావలెనని అనుకొనరు. లోకులును ఈమె కొక భర్త కలదు. ఈమె అతని సొత్తు అని తాళిని చూచి గ్రహింతురు. వైధవ్యమును పొందిన స్త్రీని చూచినవారు, గతమున ఈమె కొక భర్త ఉండెను; విధివశమున ఈమె అతనిని కోల్పోయెను; ఇకపై ఈమెకు భర్త ఏర్పడు అవకాశము లేదని తలంతురు. కావున వనితకు మంగళసూత్రము లేని రెండు దశలలో మొదటి దశయందు పలువురు ఆమెకు భర్తగా కావలయునని భావించు అవకాశము; రెండవ దశలో ఇకపై ఎవ్వరును ఆమెకు భర్తగా నుండుట సంభవింపదనుటయు ఏర్పడుచున్నవి. అట్లే, శ్రీవత్సాంకుల గ్రంథములు అవతరించుటకు ముందు వేదవాఙ్మయము తాళి లేని స్త్రీ కల్గియుండు పై రెండు దశలను పొందినది. ఎట్లనగా – వేదమున ప్రతిపాదించబడిన పరతత్త్వము బ్రహ్మ అని కొందరు, రుద్రుడని కొందరు, ఇంద్రుడని మతికొందరు వాదించిరి. ఇది మొదటి దశ. నిరీశ్వరవాదులు అట్టి ప్రభువెవ్వడును లేడనిరి. ఇది రెండవదశ. శ్రీవత్సాంకుల గ్రంథరచన జరిగిన పిమ్మట "వేదకాంతకు భర్తలు పలువురున్నారనుట, లేదా, భర్తయే లేడనుట– అను ఈ రెండు వాదములు పొసగవు. ప్రభువనువాడొకడు కలడు. అతడు విష్ణువే. **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"** (వేదములన్నిటిచే తెలియబడువాడను నేనే) **(భ.గీ.15-15)** అనునట్లు వేదప్రతిపాద్యు డతడే అను విషయము నిష్కర్షింపబడినది. ఇట్టి నిష్కర్ష **"ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా"** (ఆ వేదము నీ ఆజ్ఞగా తెలియబడుతున్నది) (వై.స్త.11)



మొదలగు శ్లోకములద్వారా కూరేశులచే చేయబడినది. కావున శ్రీవత్సాంకుల సూక్తులు వేదకాంత మెడలో తాళివంటివి. ఇట్లు పల్కుటలో అంతరార్థమేమనగా– శ్రీవత్సాంకులు సకలదుర్మతములను నిరసించి, పరతత్త్వనిర్ణయమును చేయగల్గిన వాక్పటిమను కలవారని.

చోళరాజసభలో కూరేశులు విష్ణుపారమ్యమును నిరూపించుచు పల్కిన **"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః",** (సృష్టి ఆరంభములో నారాయణుడొక్కడే ఉండెను, బ్రహ్మ లేడు, ఈశ్వరుడు లేడు) (మహోపనిషత్.1-1) **"నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః"** (నారాయణుడే పరబ్రహ్మము, నారాయణుడే పరతత్త్వము) (నారా.ఉ) వంటి సూక్తులు పురుషోత్తమునిచే పరిణీతమైన వేదకాంతమెడలో మంగళ సూత్రములయ్యెనని చెప్పవచ్చును. లేక, పూర్వము వివరించిన విధముగా కూరేశుల ప్రబంధములే వేదకాంత కంఠమున మంగళసూత్రములయ్యెననియు చెప్పవచ్చును.

శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారిచే రచింపబడిన **"కూరేశపంచాశత్"** స్తోత్రములోని మొదటి శ్లోకమున గల **"నిగమాంతాకల్ప"** అను విశేషణమును వివరించుచు ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు **"నిగమాంతానామ్ ఆకల్పః – ఆభరణం యేన సః"** అను బహువ్రీహి సమాసమువలన వేదకాంతకు అలంకారమును నిర్మించినవారను అర్థము వచ్చునని పల్కిరి. అనగా – కూరేశులు వేదకాంత మెడలో ప్రధానమైన అలంకారమును నిర్మించినవారని తాత్పర్యము. అట్టి అలంకారము పంచస్తవియే కదా! శ్రీరామానుజుల ఆజ్ఞచే శ్రీరంగేశపురోహితత్వమును శ్రీరంగామృతకవి (తిరువరఙ్గత్తు ముదనార్) వలన కూరేశులు సంపాదించిన ఐతిహ్య మిచట స్మరణీయము. కావున శ్రీరంగేశ పురోహితులగు కూరేశులు **"పంచస్తవి"** అను మంగళసూత్రమును నిర్మించి ఇవ్వగా, సర్వేశ్వరుడు ఆ సూత్రమును వేదకాంతమెడలో అలంకరించి, ఆమె తన సొత్తు అని లోకమునకు చాటెను– అని భావము. అనగా– వేద ప్రతిపాద్యమైన పరతత్త్వము శ్రీమన్నారాయణుడే– అను విషయము కూరేశుల రచనలగు పంచస్తవి మొదలగువానివలన జగత్ప్రసిద్ధి పొందెనని తాత్పర్యము. ఇట్టి వివరణము ప్రకృతమునకూడ అన్వయింప వచ్చును. లోకమున వివాహములలో పురోహితుడు మంగళసూత్రమును నిర్మించి ఇవ్వగా, వరుడు ఆ సూత్రమును వధువు మెడలో కట్టుట ప్రత్యక్షముగా అందరు చూచునదే కదా! అట్టి క్రమములో ఈ వివరణము చేయబడినది.

శ్రీవత్సచిహ్నశబ్దమునకు **"తిరుమఱు మార్బన్"** అనునది తమిళ పర్యాయము. మిశ్రశబ్దము పూజ్యవాచకము. **"నమ ఉక్తిమ్"** అనుటచే వాచికమైన నమస్కారము మాత్రమే తెలుపబడుచున్నది. కాయికమైన, వాచికమైన నమస్కారము చేయకున్నను వాచిక నమస్కార మొక్కటియైనను చాలునను విశేషార్థము ఇచట స్ఫురించుచున్నది. **"త్రయీ"** అను స్త్రీ

లింగశబ్దస్వారస్యముచే వేదమునకు వనితాసామ్యము తోచుచున్నది. **"త్రయీ కంఠే"** అనుటకు వేదాంతమను అర్థమును చెప్పవచ్చును.

ఈ శ్లోకమున **"అధీమహి"** అను పాఠాంతరము కన్పడుచున్నను, **"అధీమహే"** అను పాఠమే సరి అయినది. వేదాంతదేశికులును రహస్యత్రయసార ప్రారంభమున **"గురుభ్య శ్చ తద్గురుభ్య శ్చ నమోవాక మధీమహే"** (ఆచార్యులకు, వారి ఆచార్యులకు నమస్కారమును చేయుచున్నాను) అని పల్కుట గమనింపవచ్చును. **"అధి"** పూర్వకమైన **"ఇఙ్-అధ్యయనే"** ధాతువుయొక్క వర్తమానకాలిక రూపము **"అధీమహే"** అగును. **"నమో వాక మధీమహే"** అను వేఱొక పాఠముకూడ కొన్నిచోట్ల కన్పించుచున్నది. గ్రంథ ప్రారంభమున శ్రీశబ్దనిర్దేశముచే మంగళముతో గ్రంథమును ప్రారంభినట్లయినది. **"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే"** (మంగళమును ఆరంభములో, మధ్యలో, చివరలో కల్గిన శాస్త్రాలు వర్ధిల్లుతున్నాయి) అను మహాభాష్యసూక్తి స్మరింపతగినది. శ్రీశబ్దము ప్రయోగించుటద్వారా శాబ్దికమైన మంగళము చేయబడినది. మఱియు, సర్వశ్రేయోదాయకమైన గురువందనము చేయబడుటద్వారా ఆర్థికమైన మంగళమును ఆచరించబడినదని చెప్పనగును.

శ్రీ ఏ.వి. గోపాలాచార్య స్వామివ్యాఖ్యలోని రసఘనములగు విశేషములు కొన్ని ఈక్రింద చూపబడుచున్నవి.

ఈ శ్లోకమున భట్టరు కూరేశుల సూక్తులు చిరకాలము భర్తృవియోగమున పొందిన శ్రుతిదేవిని ఆమె భర్తగు భగవానునితో కలిపినవని వర్ణించుచున్నారు. **"నాథాశ్లేషసనాతన శ్రుతివధూవైధవ్యఖేదచ్ఛిదం ప్రాచీనాం నయపద్ధతిం యతిపతిః ప్రాచీకశత్ నైవ చేత్"** (2-45) (నాథుడైన శ్రీమన్నారాయణునితో కలసియుండు సనాతన అయిన శ్రుతికన్యకకు కుదృష్టివాదులవల్ల కల్గిన వైధవ్యదుఃఖాన్ని ఛేదించే ప్రాచీనమైన న్యాయమార్గాన్ని భగద్రామానుజులు ప్రకాశింపజేసి ఉండకపోతే) అని సంకల్పసూర్యోదయమున, **"చిరన్తనసరస్వతీచికురబంధసైరంధ్రికాః"** (ప్రాచీనవాక్కులనే కాంతయొక్క శిరోజాలను అలంకరించే సైరంధ్రులు) (36) అని యతిరాజసప్తతిలోను దేశికులు పల్కిన విధముగా భట్టరు తమ తండ్రియగు కూరేశుల సూక్తులనుగూర్చి పల్కుచున్నారు. సకలలోక మంగళమునకు మూలమగు శ్రుతిదేవికి కూరేశుల సూక్తులు మంగళమును కల్గించుచున్నవి అనునది ప్రస్తుతశ్లోక సారాంశము.

**"శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః"** - మా జనకుల పరమశోభనములగు సూక్తులు అట్లుండనిండు. వారి నామమే లోకోత్తరమైనమంగళచిహ్నమును కల్గియున్నదనుటను **"శ్రీవత్సచిహ్న"** అను మంగళకరమైన నామముద్వారా భట్టరు తెలుపుచున్నారు. శ్రీశబ్దము, శ్రీవత్సశబ్దమును మంగళార్థకములు. **"శ్రియః పతిః"** (1-1) అను మాఘుడు, **"శ్రియః కురూణాం"** (1-1) అని భారవియు తమ కావ్యారంభములను చేసిరి. **"శ్రీవత్సలక్ష్మం గళశోభి కౌస్తుభమ్"** (శ్రీవత్సమనే పుట్టుమచ్చను కలవానిని, కంఠంలో ప్రకాశించు కౌస్తుభాన్ని కలవానిని) (భాగ.10-3-9) అని అపుడే ఉద్భవించిన అద్భుతశిశువు (కృష్ణుడు) యొక్క మంగళచిహ్నములనుగూర్చి శ్రీశుకులు పల్కిరి. **"శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః"** (శ్రీవత్సాన్ని వక్షస్సులో కలవాడు, నిత్యంగా నివసించే లక్ష్మిని కలవాడు) రా.యు.114-15) అని వాల్మీకి భగవానులను నుడివిరి. అనగా - భగవానుని వక్షము శ్రీవత్సాంకితమగుటచే లక్ష్మి ఆ వక్షమును ఎల్లప్పుడు వదలకయుండును - అని తెలియుచున్నది. చిహ్నశబ్దముచే పేరులోకూడ మంగళ చిహ్నము కలదని తెలుపబడినది. **"చిహ్నై రనిహ్నవపరైః అపరైశ్చ కైశ్చిత్ నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్" (28)** (దాచడానికి సాధ్యం కానివి అయిన ఇంకా కొన్ని గుర్తులతో విద్వాంసులు నిన్ను అందరికీ ఈశ్వరుడవని తెలిసికొంటున్నారు) అని శ్రీవైకుంఠస్తవమున కూరేశులు పల్కినట్లు, కాదనుటకు వీలు కాని భగవచ్చిహ్నములను కల్గిన వేదప్రమాణములను ప్రదర్శించువారు కూరేశులు. మఱియు, ఈ ఆచార్యులు శ్రీవత్సాంశమున జన్మించిరనియు సంప్రదాయమున చెప్పబడుచున్నది.

**"నమ ఉక్తి మధీమహే"**- కూరేశుల సూక్తులు గంభీరమధురములు. వాని గొప్పతనము శ్లోకములో ఉత్తరార్థమున తెలుపబడును. దివ్యములైన, ఆశ్చర్యకరములైన సూక్తులను పల్కు కూరేశులకు నమ ఉక్తి మాత్రమే తగిన ఉపహారము- అను భావమును ఉక్తి పదమును రెండు చోట్ల ప్రయోగించుటద్వారా కవి తెలియజేసిరి. **"అధీమహే"** అనునది వేదోచ్చారణనుగూర్చిన ప్రయోగము. ఈ ప్రయోగము గూరూచ్చారణను అనుసరించి ఉచ్చరించుటను తెలుపును. ఈవిషయములు రెండును శ్లోకముయొక్క ఉత్తరార్ధమును వ్యాఖ్యానించునపుడు సమర్థింపబడును.

**"యదుక్తయః.......సూత్రతామ్"**- కూరేశులనుగూర్చి నమ ఉక్తిని పల్కినచో వేదమును అధ్యయనము చేసినట్లు ఎట్లగును? అనినచో, ఇట్లు సమాధానమును చెప్పవచ్చును. కూరేశులకు ముందు ఇతరులు చేయు వాదములచే వేదకాంత తనకు ప్రభువగు భగవానునకు దూరము చేయబడినది. కూరేశుల సూక్తులచే ఆమె తిరిగి భగవానునితో కలుపబడింది. అనగా - వేదప్రతిపాద్యుడగు పరబ్రహ్మ శ్రీరంగనాథుడే అని కూరేశులు తమ సూక్తులతో నిరూపించిరని భావము. ఇట్లు చిరకాలము భర్తకు దూరమైన వేదకాంత పునస్సమాగమన శుభవేళ తనను ఇట్లు భగవానునితో కలిపిన బ్రాహ్మణోత్తములగు కూరేశులకు కృతజ్ఞతాపూర్వకముగా నమ ఉక్తిని పల్కెను. రుక్మిణీదేవి

**“న పశ్యంతీ బ్రాహ్మణాయ ప్రియ మన్య న్ననామ సా”** (ఇంకొక ప్రియమైన కార్యము ఏదో తెలియలేని రుక్మిణి ఆ బ్రాహ్మణునకు నమస్కరించినది) అని ఘటకునకు నమస్కరించెను కదా! అపౌరుషేయి, అశరీరిణి అగు వేదకాంత ఆ విధముగా నమస్కరించలేదు. వాగ్రూపిణి అగు ఆమె వాక్సామర్థ్యమును కల్గినదగుటచే తిరిగి మంగళసూత్రములను ధరించు వేళ ఘటకులగు కూరేశులకు నమఉక్తిని పల్కినది. వేదము ఏమని పల్కినను అది అంతయు అధ్యేయమే. కూరేశులవంశమున జన్మించినవారు శ్రీ రంగరాజపురోహితులు. శ్రీ రంగరాజకల్యాణమునకు ఘటకులు అగుటయు ఇచట స్మరణీయము). అట్టి పురోహితుల విషయమున వేదకాంత వివాహవేళ పల్కిన సమఉక్తిని ఉచ్చరించుటచే ఇచట గురూచ్చారణానుచ్చారణరూపమైన **“అధీమహే”** అను క్రియాప్రయోగము **“మాతాపితృసహస్రేభ్యో వత్సలతరమ్”** అనునటుల స్వరసము వేలాది తల్లిదండ్రులకంటే వత్సలతరయు, అజ్ఞానాంధకారనివర్తినియు (వేలాది తల్లి దండ్రులకంటే వేదశాస్త్రరూపము ఎక్కువ వాత్సల్యాన్ని కల్గినది) అగు త్రయీమాతకు గురుత్వమున్న దనుటలో సందేహము లేదు కదా!

**“త్రయీకంఠే”**– భగవానునకు శ్రీభూనీళాదేవులు అను ముగ్గురు దేవేరులు. వేదమును త్రయి. త్రయీకంఠమే కదా (వేదాంతమే కదా) మన మెఱుగతగిన తత్త్వమును తెలుపును! కావున దానియందు కవికి గొప్ప కృతజ్ఞత కలదు. వేదములు మూడైనను, అవి అన్నియు భగవానుని పరమగుటచే ఏకకంఠలు. కావున **“కంఠే”** అను ఏకవచనము సార్థకము. **“కంఠే”** అను ప్రయోగము జాత్యేకవచనముగా చెప్పినను చెప్పవచ్చును. కాని, ఆ అర్థమున పైనచూపిన స్వారస్యము భాసింపదు. కావున ముందు చూపిన అర్థమే సరసము. లేక, మూడు వేదములను కలిపి ఒకే స్త్రీగా భావించినట్లు చెప్పవచ్చును. జ్ఞానమయి అగు త్రయికి, ప్రజ్ఞానఘనుడగు పరబ్రహ్మకును పరిణయము యుక్తమే కదా!

**“యాంతి మంగళసూత్రతామ్”** – శ్రీవత్సచిహ్నమిశ్రులు పురోహితులగుటచే త్రయీకాంతను, భగవానుని కలుపువారు, త్రయీ – బ్రహ్మమిశ్రయితలు. కావున మిశ్రులనదగినవారు. పురోహితవంశమువారికి సంబంధించినదంతయు మంగళ సూత్రముగానే భాసించును కాబోలు! శ్రీరంగరాజపురోహితులకు జామాత శ్రీరంగనాథుడే. శ్రీవత్సచిహ్నుల ఉక్తులు సూత్రములుగా చెప్పబడినవి. కావున వారు సూత్రకారులయ్యిరి. బ్రహ్మసూత్రమనునపుడు బ్రహ్మశబ్దమును ఆవృత్తి చేసికొని, ఒక బ్రహ్మశబ్దమునకు వేదమని, వేఱొక బ్రహ్మశబ్దమునకు భగవానుడని అర్థము చెప్పవీలున్నది. అపుడు శబ్దబ్రహ్మమగు వేదముయొక్క పరబ్రహ్మపరత్వము నిర్ణయించు సూత్రములు బ్రహ్మసూత్రములు– అను అర్థము భాసించునని వేదాంతగ్రంథములలో తెలుపబడినది. త్రయీరూపమైన బ్రహ్మ



పరబ్రహ్మతో మంగళసూత్రముతో కలుపబడుట ఇచటి స్వారస్యము. కూరేశుల సూక్తులును అట్టివే. కావున అవి బ్రహ్మసూత్రములే. కూరేశుల సూక్తులకు బ్రహ్మసూత్రత్వము ఉన్నను లేకున్నను, మంగళసూత్రత్వము మాత్రము తప్పక కలదు. శ్రీశంకరులు బ్రహ్మసూత్రము లను వేదాంతవాక్యకుసుమగ్రథనార్థములు అనిరి. మహనీయమగు ఉపనిషత్ సుధాబ్దిసారసుధను పొందుటకు సాధనములు బ్రహ్మసూత్రములని దేశికులు వచించిరి. శబ్దబ్రహ్మయగు త్రయికి, పరబ్రహ్మతో వివాహ మంగళము నిర్వర్తించుటకు అవసరమైన మంగళతంతువులు కూరేశుల సూక్తులు– అని భట్టరు అభిప్రాయము కాబోలు. **“సూచనాత్ సూత్రమ్”** అను యౌగికమైన వ్యుత్పత్తి సూత్రపదమునకు ఉన్నను, తంతువు అను రూఢ్యర్థమును గ్రహించుటలోనే స్వారస్యము కలదు. నా తండ్రియు, ఘటకులును, పురోహితులును అగు కూరేశులు వారి సూక్తులనెడి మంగళసూత్రములతో అలౌకికమైన త్రయీవధువును జామాత అగు శ్రీరంగనాథుడు అను వరునితో కలిపిరి. అట్టి శ్రీరంగనాథుని నేను సేవింతును– అను తాత్పర్యార్థము వలన ప్రస్తుతశ్లోకమును కూడా శ్రీరంగనాథుని స్తుతిలో అంతర్భవించును.



**1. స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః**
**స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః ।**
**యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్**
**క్రీడేయం ఖలు నాన్యథాఽస్య రసదా స్యాదైకరస్యా త్తయా ॥**

అశేషజగతామ్ = లోకముకన్నిటి యొక్క, సర్గ + ఉపసర్గస్థితీః = సృష్టి – స్థితి – సంహారములను, స్వర్గం దుర్గతిమ్ = స్వర్గమును, నరకమును, ఆపవర్గికపదమ్ = మోక్షస్థానమును, సర్వం చ కుర్వన్ = మిగిలిన అన్నిటిని సృష్టించుచు, హరిః = భగవానుడు, యస్యాః = ఏ లక్ష్మీదేవియొక్క, ముఖం = ముఖమును, వీక్ష్య = చూచి, తత్ + ఇంగిత పరాధీనః = ఆమె ముఖములోని భ్రూభంగాది చలనముల సూచనలకు పరాధీనుడై, అఖిలం = (పూర్వము తెలుపబడిన సృష్ట్యాదులను) అన్నిటిని, విధత్తే = చేయుచున్నాడో, అన్యథా = అట్లు ఆమె ముఖములోని భ్రూభంగాది కదలికల సూచనలకు పరాధీనుడు కాకున్నచో, అస్య = ఈ భగవానునియొక్క, తయా = ఆ లక్ష్మీదేవితో, ఐకరస్యాత్ = ఒకే రసమును కల్గియున్న స్వభావమువలన, ఇయం = ఈ, క్రీడా = సృష్ట్యాదిరూపమగు లీల, అస్య రసదా = ఈ భగవానునకు ఆనందమును కల్గించునవిగా, న స్యాత్ ఖలు = కాదో, (సా = ఆ లక్ష్మీదేవి ) స్వస్తి = శ్రేయస్సును, దిశతాత్ = అనుగ్రహించుగాక!

**భావనావ్యాఖ్య :–** భగవానుడు సకలలోకముల సృష్టిస్థితిసంహారములను చేయునపుడు, వారి కర్మానుగుణముగా పురుషార్థప్రదానమును చేయునపుడును, ఏ లక్ష్మీదేవి ముఖములోని హావభావాదులను గమనించి తదనుసారముగా ప్రవర్తించునో, ఏ లక్ష్మీదేవి యొక్క ముఖములోని ఇంగితములను భగవానుడు అనుసరింపకపోయినచో ఆమెతో ఒకే రసమును అనుభవించువాడైయుండు తనకు ఆ సృష్ట్యాది లీలావ్యాపారములు ఆనందమును కల్గింపవో, అట్టి లక్ష్మీదేవి మనకు మంచిని కల్గించునుగాక!–అని భావము.

భగవానుడు అన్ని లోకములను సృష్టించి, రక్షించి, లయమును చేయునపుడు, ఆయా చేతనులు వారి వారి కర్మఫలములను అనుభవించుటకై స్వర్గనరకాద్యనుభవస్థానములను, నిరవధికానందస్థానమగు పరమపదమును, మిగిలిన భోగ్య, భోగోపకరణ, భోగస్థానములగు సకలపదార్థములను వారివారికి అనుగ్రహించునపుడును లక్ష్మీదేవి ముఖములోని భ్రూభంగాది సూచనలను అనుసరించి, వర్తించుచు ఆమె కటాక్షానుగుణముగా అన్నిటిని పాలించుచున్నాడను ఈ సూక్తి భగవానుని గొప్ప రసికతను సూచించును.

భగవానుడు అవాప్తసమస్తకాముడు. కొత్తగా సంపాదింపవలసిన, పొందవలసిన విషయమేమియు స్వామికి లేదు. అతడు సృష్ట్యాదులను చేయుటకు ఫలము తాత్కాలికముగా కల్గు ఒకానొక ఆనందరసానుభవమేతప్ప, కాలాంతరములో వేఱొక ఫలము ఏదయిన లభింపవలెనని తలచి మాత్రము కాదు. సార్వభౌములగు రాజులకు ద్యూతక్రీడాదులవలె, చిన్న పిల్లలు గుజ్జనగూళ్ళు (పిచ్చుకల గూళ్ళు) కట్టుకొనునట్లు, ఈ సృష్ట్యాదులు స్వామికి లీలామాత్రములు. **"లోకవత్తు లీలాకైవల్యమ్"** అని బ్రహ్మసూత్రకారుడును, **"క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ"** (ఆడే పిల్లవాని చేష్టవలె ఉండు ఆ పరమాత్మ లీలను దర్శించు) అని శ్రీవిష్ణుపురాణమున శ్రీపరాశరమహర్షియు, **"ఇన్బుఱు మివ్విళైయాట్టుడైయాన్"** (ఆనందాన్ని కల్గించే ఈ లీలలను కలవాడు) అని, **"నళిర్ మామలరున్ది వీట్టైప్పణ్ణి విళైయాడుమ్"** (చల్లని నాభీపద్మమనే ఇంటిని నిర్మించి, ఆడేవానిని) అని ఆళ్వార్లును అనుగ్రహించిరి. ఇట్టి ప్రమాణప్రసిద్ధి **"ఖలు"** అను అవ్యయముద్వారా ధ్వనించుచున్నది. కావున, తాత్కాలికరసము మాత్రమే ఫలముగా కల్గిన ఈ సృష్ట్యాది వ్యాపారములు, లక్ష్మీదేవి ఇంగితములను అనుసరించుచు చేయక పోయినచో, అవి భగవానునకు ఆనందమును కల్పింపవు. సరికదా, కేవలము ప్రయాసరూపముగానే పరిణమించును. అందుచే ఆమె ముఖకవళికలను స్వామి గమనింపవలసిన అవసరమున్నది. **"ఐకరస్యజుషోః శేషిదంపత్యోః"** అనుచు శ్రీదేశికులును ఈ సూక్తిభావమును అనుసంధించిరి.



**"ఏకో రసో యస్య సః ఏకరసః, తస్య భావః ఐకరస్యమ్, తస్మాత్"** అను విగ్రహమును **"ఐకరస్యాత్"** అను పదమునకు చెప్పనగును. లక్ష్మీదేవికి ఏ రసము భోగ్యమో, ఆ రసమే భగవానునకును మధురమైయుండుటచే – అని దీని అర్థము. **"ఏకరసత్వం నామ తదభిమత్యనమత్యను విధాయిస్వప్రియాఽప్రియత్వమ్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. లక్ష్మీదేవికి అభిమతమైనదియే. భగవానునకు ప్రియమైనదిగను, ఆమె అభిమతము కానిది స్వామికి అప్రియముగను ఉండవలసియుండుటచే, ఇట్టి ఐకరస్యము నిలచియుండుటకై ఆమె ముఖచిహ్నములును స్వామి అనుసరించుట అత్యంతావశ్యకము. తాను స్వతంత్రుడుడై, ఆమె భావములను గమనింపక వానిని చేసినచో, ఆమె రసము వేఱుగను, తన రసము వేఱుగను భిన్నములై, ఐకరస్యము లేకుండపోవును కదా!

ఈ శ్లోకములోని తృతీయపాదభావమును దృష్టిలో నుంచుకొనియే **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకై స్సార్థయంత్యై కృతోఽంజలిః"** (సమస్త చిదచిత్తుల నిర్వహణకై హరి చేయు ప్రయత్నాలను తన అంగీకారసూచకాలైన చూపులతో సార్థకం చేసే లక్ష్మికి ఈ అంజలి చేయబడినది) అని శ్రీ పరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశము ప్రారంభములో అనుగ్రహించిరి. ఇంగితమనగా భ్రూభంగాదిరూపమైన, (కనుబొమల కదలికలు మొదలగు వానిద్వారా) తన అంగీకార – అనంగీకారసూచకమైన ఒకానొక వ్యాపారవిశేషము. దానికి పరాధీనుడగుట అనగా – దానిని అనుసరించుటయే. నాల్గవ పాదములోనున్న **"అస్య"** అను పదమును **"అస్య తయా ఐకరస్యాత్. అస్య ఇయం క్రీడా, అస్య రసదా న స్యా దితి"** అను మూడు చోట్ల అన్వయింపనగును.

**"యస్యా ముఖం వీక్ష్య హరిః అఖిలం విధత్తే, సా శ్రీః స్వస్తి దిశతాత్"** అని శ్లోకములో ప్రధానవాక్యము. **"క్రీడేయం ఖలు"** అనునది అవాంతరవాక్యము. ఇచట కూరేశులు **"స్వస్తి దిశతాత్"** అనుచు ఆశించిన మంచి ఏమి? అనినచో, ప్రకరణము బట్టి లక్ష్మీదేవిని బాగుగా స్తుతించుటకు ఆవశ్యకమైన వాక్సమృద్ధి. భక్తి సమృద్ధి మొదలగునవియే కదా! ఈ అంశము దీనికి పిమ్మటగల శ్లోకమున స్ఫుటమగుచున్నది. **"శ్రీరిత్యేవ చ నామ తే భగవతి–ఇత్యుక్తవైభవా శ్రీనామధేయా సా స్వస్తి దిశతాత్ దదాతు. స్తోత్రనిర్మాణోద్యుక్తాయ మహ్యం తదనుకూలవాక్సమృద్ధ్యాదికం ప్రదద్యాదిత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అశేషజగతాం శ్రీః స్వస్తి దిశతాత్"** అని అన్వయించి అర్థమును కొందరు చెప్పిరి. ఇట్టి అన్వయము గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో కలదు. ఇందులకు ప్రమాణముగా – **"స దిశతు భగవా నశేషపుంసాం హరి రపజన్మజరాదికాం సమృద్ధిమ్"** (సకలజనులకు పుట్టుక, ముసలితనం, మరణం మొదలైనవి లేని సమృద్ధిని ఆ భగవానుడైన హరి ప్రసాదించుగాక) అను విష్ణుపురాణ వచనమును మనస్సున నుంచుకొని కూరేశులీ

శ్లోకమును రచించిరని వ్యాఖ్యానించిరి. ఇచటి ఈ విష్ణుపురాణప్రమాణములోవలెనే కూరేశులును ప్రకృతశ్లోకములో హరిశబ్ద ప్రయోగమునుచేయుట, ఇందలి భావమును అనుసంధించుచు భట్టరు **"శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకై స్సార్థయంత్యై"** (చిదచిత్తులను అన్నిటినీ సృష్టించడమనే హరియొక్క వ్యసనాన్ని తన అంగీకార రూపాలైన చూపులతో సార్థకం చేసే లక్ష్మికోసం) అనుచు శ్రీగుణరత్నకోశములో అనుగ్రహించిన సూక్తియందుకూడ హరిశబ్దప్రయోగము చేయుటయును గమనింపతగినది. ఉపసర్గార్థములు ధాతువుయందు లీనమైయుండునను న్యాయమున శ్రీగుణరత్నకోశసూక్తి లోని హరిశబ్దమును పలువురు పలు రీతులలో వ్యాఖ్యానించిరి. **"స్వస్తి శ్రీ ర్దిశతాత్"** అను ఆశీర్వచనరూపము ప్రయోగముద్వారా కవి ఇచట కావ్యారంభములో చేయవలసిన ఆశీర్వచన రూపమంగళమును ఆచరించినట్ల యినది.

సృష్టిని చెప్పు ఈ సందర్భమున హరిశబ్దప్రయోగము సార్థకము. **"బ్రహ్మాణ మింద్రం రుద్రం చ యమం వరుణ మేవ చ, ప్రసహ్య హరతే యస్మాత్ తస్మా ద్ధరి రిహోచ్యతే"** (బ్రహ్మను, ఇంద్రుని, రుద్రుని, యముని, వరుణుని లయముచేయుటచే హరి అనబడు చున్నాడు) అను రీతిలో అందఱిని సంహరించి, సృష్టించునపుడు తానొక్కడే ఉండెననుటచే భగవానుని జగత్కారణత్వమును ఈ హరిపదము తెలుపుచున్నది. **"భూతానాం ప్రభవో హరిః"** అను సూక్తియు ఇచట గ్రాహ్యము. అట్లే, సృష్టికి ఆవశ్యకములగు గుణములను స్వామి కల్గియుండుటకూడా హరిశబ్దము వలన తెలియుచున్నది. **"హరి ర్హరతి పాపాని"** అనునట్లు పాపములను పోగొట్టుటకు జ్ఞానము, శక్తి, దయ, క్షమాదులు కావలయును. కావున, ఆ గుణసద్భావ మీహరిశబ్దముచే ద్యోతితము. **"ఉపహరతీతి హరిః"** అనునట్లు సృష్టించిన జగత్తును లక్ష్మికి కానుకగా ఇచ్చువాడను అర్థమునుకూడ హరిశబ్దము చెప్పుచున్నది. కావున దివ్యదంపతుల ఐకరస్యమును ప్రతిపాదించు ఈ సందర్భమున **"హరి"** నామ ప్రయోగము అత్యంతము అర్థవంతము. **"అవావఱ చ్చూழ் అరియై"** (ఆర్తి తొలగునట్లు సంశ్లేషించి అనుగ్రహించిన హరి) **(10-10-11)** అను తిరువాయ్మొழி సూక్తిని నమ్బిళ్ళైఈడులో **"సర్వాపేక్షితప్రదనాన సర్వేశరనై"** అని కూడ వ్యాఖ్యానించుటను గమనింపనగును.

ఇక, ఈ శ్లోకములో తెలుపబడిన సృష్టిస్థితిసంహారములలో భగవానుడు సలక్ష్మీకుడనుట **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** ఇత్యాదిశ్రుతులవలన స్పష్టము. ఇచటి శ్రుతిలోని దేవశబ్దము బహ్వర్థకము. కావున **"దివ్-క్రీడా"** అను అర్థమును అనుసరించి క్రీడించువాడు- అను అర్థమును ఇచటి దేవశబ్ద మిచ్చును. దేవత్వమనునది ఆటలాడువాని ధర్మము - అనగా క్రీడయే. ఈ సృష్ట్యాదిక్రీడను భగవానుడు లక్ష్మితో కలసి ఆడుకొనునని



పై శ్రుతి చెప్పినట్లయినది. దివ్యసూరులును **"మున్నులకమ్ ఉణ్డుమిழ்న్దాయ్క్కు. . . . తిరుమాలే"** (ముల్లోకములను మింగి, వెలువరించినవాడవైన లక్ష్మీనాథా!) ఇత్యాదిగా ఈ అంశమును పల్కిరి.

సృష్టించు కాలములో భగవానుడు లక్ష్మీదేవితో కలసియుండుననుటను **"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి"** (కాలము మొదలగునవి అన్నియు విద్యుద్వర్ణమును కల పురుషునివలన జన్మించినవి) అను శ్రుతివాక్యముద్వారా తెలియవచ్చును. ఇచటి విద్యుచ్ఛబ్దము భగవద్వాచకము. భగవానుడు విద్యుద్వర్ణుడనుట **"విద్యుల్లేఖేవ భాస్వరా"** అను శ్రుతివలన స్పష్టము. ఇక, సంహారకారమున సలక్ష్మీకుడై భగవానుడుండుననుట **"ఆనీదవాతగ్ం స్వధయా తదేకమ్"** అను శ్రుతివలన తెలియుచున్నది. **"స్వధా త్వం లోకభావినీ"** అను సూక్తినిబట్టి, **"శుచిం స్వాహాం సుధాం స్వధామ్"** అను అష్టోత్తర శతనామస్తోత్రప్రమాణమునుబట్టి ఇచటి స్వధాశబ్దము లక్ష్మీవాచకము. **"శ్రేష్ఠశ్చ"** అను బ్రహ్మసూత్రభాష్యమునకుగల శ్రుతప్రకాశికలోని **"స్వధయేత్యనేన స్వధాత్వం లోకభావినీత్యుపబృంహణా ల్లక్ష్మీవిశిష్టత్వమ్ సూచ్యతే"** అనెడి వివరణము అనుసంధేయము. **"ఏకో విద్యాసహాయ స్త్వం యోగే యోగ ముపాగతః"** అను హరివంశసూక్తియును వేఱొక ప్రమాణము. ఇందలి విద్యాశబ్దము లక్ష్మీవాచకము. ఇక, రక్షణమును స్వామి లక్ష్మీ సహితుడుగానుండియే నిర్వహించుననుట శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులలో సుప్రసిద్ధము కదా!

లక్ష్మీతత్త్వము విషయమున పలు భిన్నాభిప్రాయములున్నవి. కొందఱు ఈమెను భగవానుని సత్త అని, అహంతా మాత్రమే అని, ప్రత్యేకతత్త్వము కాదని చెప్పుదురు. కొందఱు మూలప్రకృతియే లక్ష్మి అందురు. ఇచట కూరేశులు, భగవానుడు సృష్ట్యాదులను ఈమె భావానుగుణముగా చేయుచున్నాడనుటచే ఈమె భగవానునికంటె వేఱు అని, అచేతనతత్త్వముకంటె భిన్న అనియు చెప్పినట్లయినది. అనగా - పై వాదములను నిరసించి నట్లయినది. అట్లే, భగవంతుని సృష్ట్యాదులను ఈమె ఆమోదించుననుటచే భగవానుడే లక్ష్మి అను వాదముకూడ నిరస్తము. వేదము కూడ. **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** (హ్రీ అనబడే భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అనుచు భగవానునికంటె లక్ష్మి భిన్నురాలని తేల్చి చెప్పినదికదా! భగవానుడు సృష్ట్యాదులను నిర్వహించునని, లక్ష్మీదేవి వానిని ఆమోదించునని చెప్పుటవలన భగవానుని జగత్కారణత్వాదులు, లక్ష్మీదేవియొక్క పురుషకారస్వరూపమును సూచితములు. **"లక్ష్మీ పురుషకారత్వేన నిర్దిష్టా"** అనికదా! ప్రమాణము. భగవానుడు జగత్సృష్టిలో త్రివిధకారణభూతుడు. భగవానుడు ఉపాదానకారణ మైనట్లు లక్ష్మీదేవి ఉపాదానకారణము కానేరదు. అంతమాత్రముచే లక్ష్మీదేవికి

సృష్టికార్యములో పూర్తిగా సంబంధము లేదనుట సరి కాదు. అనుమంతృత్వరూప మగు అన్వయము కలదు. "జగత్కారణత్వములో లక్ష్మీదేవికి సంబంధము ఉన్నదా ?" అని ప్రశ్నించిన నడాదూర్ అమ్మాళ్‌కు కురుకైప్పిరాన్ పిళ్ళాన్ "ఈ విషయమున సందేహము వలదు. **"ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చ ఉత్పాదయితవ్యాః"** (మనచే కర్మలు నిర్వహింపబడాలి; సత్ సంతానాన్ని మనం పొందాలి) అను ప్రమాణమున్నది కదా! కావున భగవానుని సహధర్మచారిణియగు ఈమెకును అందు సంబంధమున్నది" అని సమాధానమిచ్చిరట.

## శ్రీగార్గ్య రామానుజాచార్యవిరచితశ్రీస్తవవ్యాఖ్యా

**లక్ష్మీకటాక్షనిక్షేపా రక్షణైకకృతక్షణాః ।**
**రక్షంతూత్కులకరుణా సంధుక్షితజగత్త్రయాః ॥**

**అవ :- అథ సర్వేశ్వరాభిమతస్వరూపరూపగుణవిభావాం, సకలచేతనానాం సకలపురుషార్థప్రాప్తౌ పురుషార్థభూతాం, సర్వేశ్వరవత్ స్వయ మపి ప్రాప్యప్రాపకభూతాం లక్ష్మీం స్తోతుకామాః శ్రీవత్సాంకమిశ్రాః సకలజగదుజ్జీవనార్థ మాశీర్వాదమేవ ప్రబంధముఖేన నిబధ్నంతి. స్వస్తీతి**

**సా శ్రీః అనేకజగతాం, స్వస్తి మంగళం దిశతాత్. స్వస్తీతి ద్వితీయాంతం పదమ్. నావ్యయమ్. అశేషజగతా మిత్యస్యాత్రాప్యన్వయః. సర్గః సృష్టిః. ఉపసర్గః ఉపద్రవః. సంహార ఇతి యావత్. స్థితీ రక్షా, దుర్గతిః నరకః, యత్ర పదే ముక్తి ర్భవతి తదాపవర్గికపదమ్. ఏతత్ సర్వం, కుర్వన్ కర్తుం ప్రారబ్ధో హరిః, యస్యా లక్ష్మ్యా ముఖం వీక్ష్యైతన్ముఖేంగిత పరతంత్రః సన్, అఖిలం కరోతి తదనుమతిపూర్వకం తన్ముఖోల్లాసార్థం కరోతీత్యర్థః. ఏవమేవ కరణే హేతు మాహ - వ్రీడేయమితి. తయా శ్రియా, ఐకరస్యాత్ ఏకరసత్వాత్, తస్యా యదనుకూలం తదేవాస్యానుకూలం, యదనుకూల మస్య తదేవాస్యా అనుకూలమ్- ఇత్యేవంరూపైకరస్యాత్. అన్యథా స్వయ మేవ స్వాతంత్ర్యేణ కరణే, ఇయం జగన్నిర్మాణాది క్రీడా అస్య హరే రసదా ప్రీతిదా న స్యా త్ ఖలు. విరసా కేవలవ్యసనరూపత్వాదితి భావః. తదుక్తం శ్రీమత్పరాశరభట్టారకైః శ్రీగుణరత్నకోశే- "శ్రియై సమస్త చిదచిద్విధానవ్యసనం హరేః, అంగీకారిభి రాలోకై స్సార్థయంత్యై కృతోఽంజలిః" ఇతి వ్యాఖ్యాతం చ తత్రైవ.**

**2. హే శ్రీ ర్దేవి! సమస్తలోకజననీం త్వా స్తోతు మీహామహే**
**యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియమ్ ।**



**భక్తిం భందయ నందయాశ్రిత మిమం దాసం జనం తావకం**
**లక్ష్యం లక్ష్మి! కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీ వయమ్ ॥**

హే శ్రీః = ఓ లక్ష్మీదేవీ! సమస్తలోకజననీం = లోకముల కన్నిటికిని తల్లియైన, త్వాం = నిన్ను, వయం = మేము. స్తోతుం = స్తుతించుటకు, ఈహామహే = కోరుచున్నాము, యుక్తాం = అందులకు తగిన, భారతీం = వాక్కును, భావయ = మనస్సున భావించి నాకు అనుగ్రహింపుము, ప్రేమప్రధానాం = భక్తిప్రధానమైన (భక్తి నిండిన), ధియం = బుద్ధిని (జ్ఞానమును), ప్రగుణయ = మఱింత వృద్ధిచేయుము, భక్తిం = భక్తిని, భందయ = మంగళముగా చేయుము, (పరమభక్తివరకు వృద్ధి అగునట్లు చేయుము), ఆశ్రితమ్ = నిన్ను ఆశ్రయించిన, ఇమమ్ = ఈ, జనమ్ = జీవుని (నన్ను), తావకం దాసం = నీ దాసునిగా, (గ్రహించి), నందయ = ఆనందింపజేయుము, లక్ష్మి= లక్ష్మీదేవీ! అమీ వయం చ = ఈ దాసులము మేము, తే = నీ యొక్క, కటాక్షవీచివిసృతేః = కటాక్షవీక్షణములనెడి కెఱటముల వ్యాప్తికి, లక్ష్యం స్యామ = లక్ష్యములు అగుదుము.

**భావనా :-** ఈ శ్లోకమును లక్ష్మీదేవికి, కూరేశులకుమధ్య జరిగిన సంభాషణకు ప్రతిరూపముగా శ్రీ కాంచీ అణ్ణాస్వామి ఇట్లు సరసముగా వ్యాఖ్యానించిరి.

పూర్వశ్లోకమున **"స్వస్తి శ్రీ ర్దిశతాత్"** అని ప్రార్థించిన కూరేశులను చూచి లక్ష్మీదేవి 'కూరేశా! నేను మీకు మంచిని కల్గింపవలెనని ప్రార్థించితిరి కదా! మంచిది. మీకు ఏమి శ్రేయస్సు కావలెను? గొప్ప ఐశ్వర్యమా! సంతానమా! ఏమి కావలయునో కోరుకొనుడు ఇచ్చెదను" అనెను.

కూరేశులు అపుడు- "అమ్మా! ఆ క్షుద్రపురుషార్థములను నేను ఏనాడును కోఱను. నిన్ను నోరార స్తుతింపవలెనని ఆశపడుచున్నాను. అంతియే !" అనిరి. అపుడు లక్ష్మీదేవి- "కూరేశా! అట్లయినచో నావద్ద మీరు ప్రార్థించి పొందవలసినది కొత్తగా ఏమున్నది? మీరు గొప్ప పండితులు, కవులును కదా ! మీరు ఇష్టానుసారము స్తుతింపుడు. ఇందులో నేను అనుగ్రహింపవలసిన మంచి కొత్తగా ఏమున్నది?" అని పల్కెను. అందులకు కూరేశులు- "తల్లీ! నీ వట్లు పలుకకుము. నిన్ను బాగుగా స్తుతించుటకు తగిన వాక్సమృద్ధిని నాకు ప్రసాదింపుము" అని ప్రార్థించిరి. అపుడు లక్ష్మీదేవి - "ఆ సామర్థ్యము మీకు ఇంతకు ముందే పుష్కలముగా నున్నది. ఇంతకంటె ఇంక ఏమయిన అడుగుడు" అని బదులివ్వగా, కూరేశులు- "అమ్మా! నేను నా నోటితో ఏవో కొన్ని శబ్దములను వదరుచున్నానే తప్ప, నీ యందు భక్తితో నిండిన బుద్ధి నాకు లేదు. అట్టి బుద్ధిని నాకు అనుగ్రహింపుము." అని వేడిరి. అపుడు లక్ష్మీదేవి "నన్ను స్తుతింపవలెనని మీరు తలచినపుడే మీకు అట్టి శక్తి

మీకు కల్గినది. నాయందు ప్రేమ నిండుగ లేకుండ, మనస్సు పరిణతిని చెందకుండనున్నచో, నన్ను మీరు కీర్తింప ప్రయత్నింపరు. కావున అట్టి బుద్ధి మీకు ఇతఃపూర్వమే సిద్ధించినది. వేఱు దేనినైన ప్రార్థింపుడు" అనెను. అంత కూరేశులు – "అమ్మా! నీ దయతో ఏదో కొంచెము భక్తి కల్గినది. అది పరమభక్తిగా, పరజ్ఞానముగా, పరభక్తిగా పరిణమించు నట్లనుగ్రహింపుము.' – అని వేడిరి. అందులకు లక్ష్మి – "దానిని మీరు కోఱనక్కఱలేదు. ఆళ్వార్లవలెనే కాలక్రమమున ఒకదాని తరువాత వేఱొకటిగా అవి మీకు కల్గును. క్రమముగా తనకు తానుగా లభించుదానిని కోరుట ఎందులకు" అని అనెను. అందులకు కూరేశులు "అమ్మా! ఎపుడు ఆ భక్తి అట్లు పరిణమించును? అని నేను ఎదురుచూచుటకు, అంతవరకు భరించి యుండుటకును నేను శక్తిని కలవాడను కాను. నిన్ను ఆశ్రయించిన నన్ను ఇపుడే అంతరంగసేవకునిగా అంగీకరించి, నా సేవలను స్వీకరింపుము. నన్ను ఆనందింప జేయుము. అందులకు అనుగుణముగా నీ చల్లని కటాక్షములను నాపై ప్రసరింపజేయుము. ఇదియే నేను నీనుండి ప్రార్థించునది–" అని పల్కిరి.

ఇచట ప్రార్థించువారు కూరేశులు ఒక్కరే కదా! **"అమీ వయమ్"** అని, **"ఈహామహే...స్యామ"** అనియునుగల ఇచటి బహువచననిర్దేశములు ఎట్లు తగును? అని నచో, ఈ విధముగా నిర్దేశించుట కవిసంప్రదాయము. **"ఆత్మని బహువచనమ్"** అను న్యాయమున తనను బహువచనమున నిర్దేశించుకొను పద్ధతియును కలదు. లేక, నమ్మాళ్వార్లు తిరువిరుత్తప్రబంధ ప్రారంభమున **"ఇని యాముఱామై"** అనుచు భగవద్భక్తులను కలుపుకొని బహువచనప్రయోగమును చేసినట్లే. ఇదియును అని అనవచ్చును.

**(భావయ)** – ఇది **"భవ"** అను ధాతువుయొక్క ణిజంతము. కల్గింపుము– అని అర్థము. **(ప్రగుణయ)** – ప్రగుణనమనగా వృద్ధి చేయుట.

**(భందయ)** – **"భది – కల్యాణే "** అను ధాతువునుండి నిష్పన్నమగుటచే, శుభముగా చేయవలెను– అని దీని భావము. భక్తిని శుభమగునట్లు చేయునట అనగా – దాని పరిణామావస్థలనన్నిటిని కల్గించుట. పరమభక్తిపర్యంతము కలుగజేయుట. **"పరమభక్తి పర్యంతపరిపాకవతీం రచయేత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఆక, ఇన్ద శ్లోకత్తాల్– ఇరాప్పకలోతువిత్తు ఎన్నై ప్పయిఱ్ఱి ప్పణిశెయ్యకొళ్ళ వేణుమ్. "మయిఱ్వఱ మదినల మరుళవేణుమ్. ఎన్నై త్తీమనమ్ కెడుత్తు, మరువి త్తొழుమ్ మనమే తరవేణుమ్. తొణ్డరోర్క్కరుళి, చ్చోదివాయ్ తిఱన్దు ఉన్ తామరైక్కణ్కళాల్ నోక్కవేణుమ్. ఉఱ్ఱే నుకన్దు పణిశెయ్దు ఉనపాతమ్ పెఱ్ఱేనాక వేణుమెన్ఱు ప్రార్థిత్తారాయ్త్తు"**–అని ప్ర.భ. అణ్ణాస్వామి వారి వివరణము.



**(ఇమం జనమ్)** – ఆత్మశబ్దముతో నిర్దేశించవలసినచోట ఈ విధముగా ప్రథమ పురుషలో నిర్దేశించుట ఏమి? అనినచో, పూర్వోక్తదిశలో ఇదియును ఒక కవి మర్యాద. మఱియు, నైచ్యానుసంధానమును చేయుటలో కూడ ఇది ఒక విధము. **"అడియేన్"** అనుటకంటే గొప్పదైన నైచ్యానుసంధానమిది. సర్వనామశబ్దములకు వక్తృబుద్ధిస్థ భావమును తెలుపు శక్తి కలదు కదా!

**(కటాక్షవీచివిసృతేః)** – కృపాసాగరమగు నేత్రములనుండి కటాక్షములనెడి అలల వరుసలు విస్తరింప ప్రారంభించినచో, దాసుడనగు నేనే వానికి లక్ష్యభూతుడను కావలయును – అని భావము.

**(అమీ)**–లక్ష్మీకటాక్షము సోకకపోవుటచే ఆర్తిని చెందియున్న తమ స్థితిని కూరేశులు ఈ సర్వనామపదప్రయోగముద్వారా తెలిపిరి. **"ఏహి పశ్య శరీరాణి"** అనుచు (రాక్షసులు పెట్టు బాధలను) తమ దీనావస్థను మహర్షులు శ్రీరామునకు విన్నవించుచు, తమ దేహములను తాకి చూపుటవంటిదియే ఇది. **"వయం చేత్యత్ర చకారో నిత్యముక్తాన్ సముచ్చినోతి. యథా నిత్యముక్తా స్త్వదీయకింకరాః త్వదపాంగతరంగనిరంతరాభిషిక్తా భవంతి, తథా వయ మపి భవేమేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అట్లే, **"శ్రీః, దేవి, లక్ష్మి"** అను మూడు సంబోధనలలో ఒకటి విశేష్యముగా, మిగిలిన రెండిటిని విశేషణములుగా గ్రహింపనగును. **"సంబోధనత్రయేఽపి ద్వయోః విశేషణత్వ మేకస్య విశేష్యత్వ మితి మంతవ్యమ్ "** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య.

**(ఇమం జనమ్ నందయ)** – **"పరమభక్త్యనంతరభావి భవదీయనిత్యకైంకర్యనిరతాన్ కృత్వా సంతోషయ"** (పరమభక్తికి తరువాత కలిగే నీ నిత్య కైంకర్యంలో ఆసక్తిని కల్గించి సంతోషింపజేయాలి) అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"సమస్తలోకజననీమ్"** అను ప్రయోగముయొక్క అర్థమునకు అనుగుణముగా, ఈ లోకములోని వారందఱును పొందు ఫలమును మేము పొందవలెనను భావముతో **"అమీ"** అనుచు లోకములోనివారిని, **"వయమ్"** అని ప్రపన్నులను నిర్దేశించిరి. **"నాన్ పెఱ్ఱ పేఱు నాలూరానుమ్ పెఱవేణుమ్"** (నేను పొందిన ఫలం నాలూరాన్ కూడా పొందాలి) అని ఉదారముగా పల్కినవారుకదా కూరేశులు" అని వ్యాఖ్యానాంతరము.

గార్ధ్య :– స్వస్య స్తోత్రనిర్వాహార్థం లక్ష్మీః ప్రార్థయతే. హే శ్రీర్దేవీతి. ఈహామహే **ప్రయతామహే. యుక్తాం యోగ్యాం శబ్దార్థాలంకారయుక్తామ్ ఇతి భావః. భావయ సంభావయ. ప్రగుణయ ప్రగుణాం కురు. యాథార్థ్యస్థైర్యవైశద్యాదయో బుద్ధిగుణాః, ప్రేమప్రధానాం తద్గుణగోచరప్రేమాధికాం, భందయ వర్ధయ. అత్ర భదిధాతుః వర్ధమా**

నార్థః; అనే కార్థత్వాత్ ధాతూనామ్. బంధయేతి కేషాంచిత్ పాఠః తావకం త్వత్సంబంధినం, త్వన్నిర్వాహ్య మితి యావత్. క్రియాభేదాత్ సంబంధిద్వయస్యాప్యపౌన రుక్త్యమ్. విసృతిః ప్రసరః.

**3. స్తోత్రం నామ కి మామనంతి కవయో యద్యన్యదీయాన్ గుణాన్**
**అన్యత్ర త్వసతోఽధిరోప్య ఫణితిః సా తర్హి వంధ్యా త్వయి ।**
**సమ్యక్సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ**
**వాగ్వాచస్పతినాఽపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥**

(శ్రీః దేవి = లక్ష్మీదేవీ ), కవయః = కవులు, కిం నామ = దేనిని, స్తోత్రమ్ = స్తుతిగా, ఆమనంతి = పల్కుచున్నారు? (స్తోత్రమను పదమునకు అర్థము ఏమి అని నిష్కర్షించుచున్నారు?) అసతః = (స్తుతింపబడువానియందు) లేనివి, అన్యదీయాన్ = అతనికంటె అన్యులయందున్నవియును అగు, గుణాన్ = గుణములను, అన్యత్ర = వేఱొక చోట (తాము స్తుతింపకోరిన వానియందు), అధిరోప్య = ఆరోపించి, ఫణితిః = పల్కుట అనునది, సోత్రం యది తు = సోత్రశబ్దార్థమైనచో, తర్హి = ఆ పక్షములో (లేని గుణములను ఆరోపించి, ఉన్నవి అని పొగడుట స్తోత్రముఅగు పక్షములో),సా ఫణితిః= ఆ వాగ్వైఖరి, త్వయి = నీ విషయమందు, వంధ్యా = వ్యర్థమగును. (అట్టి సోత్రము నీ విషయమున చేయుట వీలు కాదు), అథో = లేక, సమ్యక్సత్యగుణ + అభివర్ణనం = ఉన్న గుణములను ఉన్నట్లుగా వర్ణించుటను, సోత్రం యది బ్రూయుః = స్తోత్రమని ఒకవేళ అందురా, త్వత్సద్గుణ + అర్ణోనిధౌ = నీ కల్యాణగుణములనెడి కడలిలో, (సముద్రమువలె అపారముగా నున్న నీ కల్యాణగుణములపట్ల), తాదృశీ వాక్ = అట్టి వాక్కు, (ఉన్నది ఉన్నట్లుగా పల్కుట అనునది), వాచస్పతినా అపి = గొప్ప వాక్శక్తిని కల బృహస్పతిచే కూడ, శక్యరచనా కథమ్ = రచించుటకు ఎట్లు సాధ్యమగును? (నీ గుణములను ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించు శక్తి బృహస్పతికికూడ లేనపుడు, నాకు సాధ్యమగుననుటకు అవకాశము ఎక్కడున్నది? – అని భావము)

**భావనా :–** లక్ష్మీదేవిని ఉద్దేశించి కూరేశులు "నిన్ను నేను స్తుతింపవలెనని కోరుటయే మొట్టమొదట అసంబద్ధమైన విషయము" అనుటను చమత్కారపూర్వకముగా ఇందు తెలుపుచున్నారు. పూర్వశ్లోకము నుండి **"శ్రీః, దేవి"** అను సంబోధనలను రెండిటిని అనుషంగము చేసికొని, అర్థము చెప్పనగును.

తల్లీ! లక్ష్మీదేవీ! నిన్ను స్తుతించుట అనునది సాధ్యమైన విషయమేనా? అని పరిశీలించినపుడు, అది సంపూర్ణముగా అసంభావితమని తోచుచున్నది. లోకములో



ఒకనిని వేఱొకడు స్తుతించుటను చూచుచున్నాము. మొట్టమొదట స్తుతి అనగా ఏమి? అని విమర్శింపవలెను. అట్లు విమర్శించినపుడు స్తోత్రశబ్దార్థము రెండు విధములుగా తోచుచున్నది. ఒకనియందు లేని గుణములను వేఱొకచోటినుండి కొనివచ్చి, ఆరోపించి పొగడుట స్తోత్రమని చెప్పుట కలదు. అది ఎట్లనగా – ధాన్యార్థియైన ఒక యాచకుడు ఒక బట్టతలవానిని పొగడ గోరి, "సుందరకేశా! సుందరకేశా! " అని పల్కుట. ఇట్టి స్తోత్రమునకు లక్ష్మీదేవి విషయమున అవకాశము లేదు. ఈమెయందు గుణములు అన్నియు పూర్ణముగా లేకపోయినపుడుకదా వేఱొక చోటనుండి తీసికొనివచ్చి ఆరోపించుట. **"అసంఖ్యాతగుణగణనిధౌ భవత్యామ్ అవిద్యమానగుణారోపాసంభవాదితి భావః"** (లెక్క లేనన్ని గుణగణాలకు నిధి అయిన నీలో లేని గుణాన్ని ఆరోపించే అవకాశం లేనందు వల్ల– అని భావం) అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అందుచే ఆ స్తుతిప్రకారము ఇచట అసంభావితము. ఇట్లే, వేఱొక రీతిలోకూడ స్తోత్ర శబ్దార్థమును పెద్దలు నిర్వచింతురు. అది ఏమనగా – ఒకనియందున్న గుణములను యథాతథముగా పొగడుటయే. ఇట్టి స్తోత్రముకూడ లక్ష్మీదేవివిషయమున అసాధ్యమే. ఆమె గుణగణములు ఒక అంతు లేని సముద్రమువంటివి. వానిలో ఏకదేశముకూడ బృహస్పతిచే సైతము వర్ణించుటకు సాధ్యపడదు– అని తెలిసిన పిమ్మట, ఇక వేఱెవ్వరివలనకూడ ఆ గుణములను వేనిని విడువకుండ, ఉన్నవి ఉన్నట్లు వర్ణించుట సాధ్యము కాదనుట కింపునర్న్యాయసిద్ధము. అందుచే, పై రెండు రీతులలోని స్తోత్రములలో ఏ ఒక్కటిని చేయుటకుకూడ లక్ష్మీదేవి విషయమున అవకాశము లేదు – అని తెలుపుటద్వారా అసాధ్యమైన శ్రీస్తవములో నేను ప్రయత్నించుట అతిసాహసము; చాల చాపలమును – అనుచు కూరేశులు నైచ్యాను సంధానమును చేసినట్లయినది. **"కల్యాణగుణనిధిత్వాత్ అవిద్యమానగుణారోపో, విద్యమానగుణయథావద్వర్ణనం చ న సంభవతీతి భావః"** (కల్యాణగుణ నిధివి కనుక లేని గుణాన్ని ఆరోపించే అవకాశం లేదు. ఉన్న గుణాలను యథాతథంగా వర్ణించడం సంభవం కాదు) అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. శ్లోకములో **"వాచస్పతినా"** అనుటకు **"నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి"** అను మంత్రార్థమును దృష్టిలో నుంచుకొని, హయగ్రీవునిచే అను అర్థమును కొందఱు వ్యాఖ్యాతలు తెల్పిరి. ఇందులకు ఉపోద్బలకముగా ఈ స్తుతిలోని **"దేవి! త్వన్మహిమావధిః న హరిణా"** (దేవీ! నీ మహిమ అవధి హరిచేగాని, నీచేగాని తెలియరానిది) అను 8వ శ్లోకమునందలి ప్రయోగమును, యామునుల చతుఃశ్లోకిలోని **"యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః నాలం మాతు మియత్తయా"** (నీ మహిమను నీవల్లభుడు తన మహిమనువలె ఇంతటిది అని తెలియలేదు) అను సూక్తిని ప్రమాణీకరించిరి.

**గార్గ్య :- సంప్రతి ప్రశ్న- ప్రతివచన తత్ప్రతిక్షేపణరూపేణ న కస్యాపి వాఙ్మనస గోచరాసంఖ్యేయకల్యాణగుణగణాయాః లక్ష్మ్యాః స్తోత్రాధికార ఇత్యాహ. స్తోత్ర మితి.**

**తత్ర ప్రథమం పృచ్ఛతి స్తోత్రం నామేతి. ఉత్తర మాశంకతే యదితి. ప్రతిక్షి ప్రతి సా తర్హీతి. వాస్తవగుణసద్భావవాదారోపాసంభవా దితి భావః. ప్రకారాంతరేణోత్తర మాశంకతే-సమ్యగితి. ప్రతిక్షిపతి కథ మితి. అర్ణోర్నిధిః సముద్రః. త్వద్గుణా వాచామ గోచరా- ఇతి భావః.**

**4. యే వాచాం మనసాం చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణా స్తావకాః ।**
**తానేవ ప్రతి సాంబుజిహ్వా ముదితా హై మామికా భారతీ ।**
**హాస్యం తత్తు న మన్మహే న హి చకోర్యేకాఽఖిలాం చంద్రికాం**
**నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి ॥**

శ్రీః దేవి = లక్ష్మీదేవి !, తావకాః = నీకు సంబంధించిన, యే గుణాః = ఏ గుణములు, వాచాం మనసాం చ = వాక్కుకు, మనస్సుకును, దుర్గ్రహతయా = అందని విగా, ఖ్యాతాః = ప్రసిద్ధిని పొందినవో, తాన్ ప్రత్యేవ = ఆగుణము లను గూర్చియే, మామికా = నాకు చెందిన, భారతీ = వాక్కు, సాంబుజిహ్వాం (యథాతథం)= రసముతో కూడిన నాలుకను కల్గినట్లు, ఉదితా = ఉదయించినది, హై = ఎంత ఆనందము, తత్తు = అట్లు వాక్కు ఉదయించుటను, హాస్యమ్ = పరిహసింప తగినదిగా, న మన్మహే = (దాసులమగు మేము) భావింపము. (ఎందులకనగా), చకోరీ= ఆడచకోరపక్షి, అఖిలాం చంద్రికాం= వెన్నెలను అంతటిని, ఏకా అహం = నేను ఒక్కతెనే, పాతుం = తాగుటకు, అలం నాస్మి = శక్తికల్గినదానను కాను, ఇతి = అని తలచి, తృషి సత్యామ్ = దాహము కల్గినపుడు, రసనామ్ = తన నాలుకను, ప్రగృహ్య = ముడుచు కొని, న ఆసీత హి = ఊరకనే ఉండలేదుకదా! (ఆ విధముగానే నేనుకూడ నిన్ను పూర్తిగా స్తుతింపలేకపోయినను, నిన్ను ఎంతో కొంత స్తుతింపకుండ ఊరకనే ఉండలేను- అని భావము.)

**భావనా :-** పూర్వశ్లోకములో లక్ష్మీదేవి గుణములు అపరిచ్ఛిన్నములు - అనగా ఇంతటివి, ఇట్టివి అని తెలిసికొనుటకు సాధ్యము కానివి- అని తెలుపబడినది. అట్లయినచో, లక్ష్మిని స్తుతించుట ఎట్లు సాధ్యము? అను సందేహము వెంటనే కల్గును. కావున, దానికి సమాధానమును ఈ శ్లోకములో సోదాహరణముగా కూరేశులు నుడువుచున్నారు.

**"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (భగవానుని గుణములను ఇతమిత్థముగా వర్ణించలేక వేదాలుకూడ మనస్సుతోపాటు వెనుదిరుగుతున్నాయో)



అనుచు వేదము భగవద్గుణములు వాక్కులకే కాదు, మనస్సుకుకూడ అందనివి- అని అన్నది. లక్ష్మీదేవీ! నీ గుణములును అట్టివే. అట్టి నీ గుణములను కీర్తింపవలెనని నా నాలుకలో జలము ఊఱుచున్నది. వాక్కు బయల్వెడలుచున్నది. అశక్యమగు నీ స్తుతి విషయమున ఈ విధముగా నేను ప్రయత్నించుట చాల పరిహసింపతగినది- అని కొందరు భావింప వచ్చును. కాని, నేను దీనిని పరిహాసాస్పదముగా భావింపను. ఎందులకనగా, వెన్నెలను తాగి జీవించు చకోరిపక్షి వెన్నెలను పూర్తిగా నేనొక్కతెనే తాగలేను కదా! అని తలచి, తన దాహమును తీర్చుకొనుటకై ఆ వెన్నెలను సాధ్యమైనంత తాగకుండ, నాలుకను మడచుకొని ఊరకనే ఉండదు కదా! ఆ విధముగా నేనుకూడ నీ కల్యాణ గుణములను సంపూర్ణముగా అనుభవించుటకు వీలులేదను కారణముచే చేతులను ముడుచుకొని ఉండలేను. కావున నాకు వీలయినంతలో నేను నిన్ను స్తుతించుట ఉచితమే కాని, పరిహాసాస్పదము కాబోదు. దీని తాత్పర్యార్థమేమనగా - ఉన్న అంశములలో కొన్నిటిని యథాశక్తి వర్ణించుటకూడా స్తోత్రమే అగును-అని. **"సామ్బుజిహ్వామ్"** అనునది క్రియావిశేషణము. **"అణ్ణిక్కు మముదూఱుమ్ ఎన్నావుక్కే"** (నా నాలుకను రుచిస్తుంది, అమృతం ఊరుతుంది) అను కణ్ణినుణ్ శిఱుత్తామ్బుసూక్తిని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రయోగము చేయబడినది. దీనివలన లక్ష్మీదేవిగుణముల రస్యత, వానియందు కవికిగల ఆదరాతిశయమును తెలియుచున్నవి. ఇందలి అలంకారము అర్థాంతరన్యాసము.

**గార్గ్య :- హే లక్ష్మి. యద్యపి తవ గుణా వాఙ్మనసాగోచరా, అథాపి తద్వర్ణన మంతరేణాత్మధారణం కర్తు మసహమానోఽహం యావద్బలం వర్ణయామీత్యాహ యే వాచామితి.**

**దుర్గ్రహతయా గ్రసితుం కబలయితు మశక్యతయా, సాంబుజిహ్వా మితి క్రియా విశేషణమ్. సద్రవరసజ్ఞమ్ ఇతి. ఉదితా ఉద్యుక్తా. జిహ్వా రస్యపదార్థదర్శనే స్వయం ద్రవతి. అతః స్వయ మేవోద్యుక్తేతి భావః. హై ఇత్యవ్యయమ్ ప్రసిద్ధిపరమ్. వాచస్పతి ప్రభృతిభి రశక్యగుణవర్ణనే మమ హాస్యత్వ మపి నాస్తీత్యాహ. హాస్య మితి. భారతీ ఉదితేతి యత్ తత్తు హాస్యం న మన్మహ ఇత్యర్థః. ఏతాదృశీ మమ స్తోత్రప్రవృత్తిః యుక్తా చరితార్థ చేతి దృష్టాంతముఖేనాహ న హీతి. తృషి పిపాసాయాం, ప్రగృహ్య ప్రతిరుధ్య.**

**5. క్షోదీయా నపి దుష్టబుద్ధి రపి నిస్స్నేహోఽప్యనీహోఽపి తే**
**కీర్తిం దేవి । లిహ న్నహం న చ బిభేమ్యజ్ఞో న జిహ్రేమి చ ।**
**దుష్యే త్సా తు న తావతా న హి శునా లీఢాఽపి భాగీరథీ**
**దుష్యేత్ శ్వాఽపి న లజ్జతే న చ బిభేత్యార్తి స్తు శామ్యే చ్ఛునః ॥**

దేవి = లక్ష్మీ దేవీ !, అజ్ఞః = ఏమియు తెలియనివాడను అగు, అహమ్ = నేను, క్షోదీయాన్ అపి = మిక్కిలి నీచుడను అయినను, నిస్స్నేహః అపి = స్నేహమును లేనివాడను అయినను, అనీహః అపి = ఏవిధమైన ప్రయత్నమును లేనివాడను అయినను, తే = నీ యొక్క, కీర్తిమ్ = కీర్తిని, లిహన్ = (స్తోత్రముఖమున) పల్కుచు అనుభవించుచున్నవాడనై, న చ బిభేమి = భయపడుటలేదు, న జిహ్రేమి చ = లజ్జించుటకూడ లేదు, సా కీర్తిః తు = (నాచే వర్ణింపబడు) ఆ కీర్తి అన్నచో, తావతా = తావన్మాత్రముచే, (అల్పజ్ఞుడనగు నా నోటిలోనుండి బయటకు వచ్చినంత మాత్రముచే), న దుష్యేత్ = (అది) చెడిపోదు, (అది ఎట్లనగా ) భాగీరథీ = (స్వతస్సిద్ధముగా పవిత్రమైన) గంగానదీ జలములు, శునా= కుక్కచే, లీఢా అపి = నాకబడినను, న హి దుష్యేత్ = చెడిపోవుకదా, శ్వా అపి = (గంగా తీర్థమును నాకిన ఆ) కుక్క కూడా, న లజ్జతే = సిగ్గుపడుట లేదు, న బిభేతి చ = భయపడుటయును లేదు, శునః = ఆ కుక్కయొక్క, ఆర్తిః తు = దాహము, శామ్యేత్ = (గంగాజలపానముచే) ఉపశమించును.

**భావనా :–** స్తుతించుటకు తగిన యోగ్యత తనకు లేకుండుటవలన లజ్జ, భయమును కల్గును, మఱియు, అయోగ్యుడగు తాను చేయు స్తోత్రమువలన లక్ష్మీదేవికి **"ఉన్ తొల్ పుకళ్ మాశూణాదో"** (నీ సహజకల్యాణగుణాలు మాసిపోవా) అను రీతిలో అవద్యకరమగును– అని శంకించి, అందులకు తగిన సమాధానమును కూరేశులు ఇందు దృష్టాంతపూర్వకముగా పల్కుచున్నారు.

**(క్షోదీయా నపి . . . . )** "అతిక్షుద్రుడగు మానవుడొకడు సర్వోత్కృష్టుడగు వేఱొకనిని స్తుతించుట సిగ్గుకు, భయమునకు కారణమగుట లోకానుభవసిద్ధము. అంతియే కాక, దేవతలకు శేషమైన పురోడాశమును శునకము స్పృశించినచో, ఆ పురోడాశము అశుద్ధమగును. అట్లే, ఉత్తమపురుషులను నీచులు స్తుతించినచో, ఆ ఉత్తమపురుషులకు ఆ స్తుతివలన దోషమే ప్రాప్తించును. కావున, అతిక్షుద్రుడవగు నీవు సర్వోత్కృష్ట అగు లక్ష్మీదేవిని లజ్జ, భయమును ఏమియు లేకుండ స్తుతింప ప్రయత్నించి, తద్ద్వారా ఆమెకు అవద్యము కల్గింపదలచితివే! ఇది తగునా! తగదుకదా! అందుచే, ఇకపై అయినను "నాకు తగని కార్యమును చేయుచుంటినే!" అను లజ్జను, "నేను స్తుతించుటవలన లక్ష్మీదేవికి దోషము ప్రాప్తించునో! ఏమో!" అను భయమును పొంది, వెనుకంజ వేసినచో, ఇద్దఱికిని మంచిదిసుమా!"– అని కొందఱు తమనుగూర్చి పల్కుదురని భావించి, అందులకు సమాధానముగా కూరేశులీ శ్లోకమును అనుగ్రహించిరి. "నాకు లజ్జ కల్గుటకు కాని, భయము కల్గుటకు కాని కారణము లేదు. నా స్తోత్రముచే లక్ష్మీదేవికి ఏ దోషమును ప్రాప్తించదు" అనుటను చమత్కారకరముగా, సదృష్టాంతముగా తెలుపుచున్నారు.



నేను అతిక్షుద్రుడనై, దుష్టబుద్ధినై, ఆర్ద్రచిత్తమును లేనివాడనై, **"కళ్ళత్తే నానుమ్ తొణ్డాయ్ త్తొణ్డుక్కే కోలమ్ పూణ్డు"** అనునట్లు కపటముగానైనను కొన్ని కైంకర్యవేషములను ధరింపవచ్చును కదా! అట్టి చేష్టలనుకూడ చేయనివాడనై ఉన్నాను. ఇట్టి రీతులలో ఇతరులు మిక్కిలి అసహ్యించుకొను రీతిలోనున్నవాడను అయినను, ఓ లక్ష్మీదేవీ! నీ కల్యాణ గుణములను నిర్భయముగా, నిర్లజ్జగా స్తుతింప ప్రారంభించితిని. ఇట్లు అన్ని విధములా అనర్హుడనగు నేను నీ కీర్తిని కీర్తింపవలెనని ప్రయత్నించినను, నీ కీర్తికి ఎట్టి అవద్యమును కలుగదు. ఇది ఎట్లనగా తెలిపెదను వినుము. లోకములో శునకము అతినీచమైన జంతువు. అది తనకు కల్గిన తీవ్రమైన దాహమును తీర్చుకొనుటకై గంగాతీర్థమును పానము చేయునపుడు "అయ్యో! ఈ పుణ్యతీర్థమును నేను తాకవచ్చునా!" అని అది సిగ్గుపడి, భయపడి, తాగుట మానివేయదు కదా! ఆ విధముగా గంగాజలమును పానము చేసిన శునకము దాహము ఉపశమించునుకూడ. అంతియే కాదు, ఆ శునకస్పర్శవలన గంగానదికి ఏ విధమైన ఆశౌచమును కలుగదు. అట్లే నీకు నా స్తుతివలన ఏవిధమైన దోషమును సంభవింపదు. నాకు తృప్తియు కలుగును– అని భావము.

దీనివలన లక్ష్మీదేవియొక్క గుణములు గంగాప్రవాహజలములవలె అపరిమేయములు, స్వతః శుద్ధములును – అను విషయము వ్యక్తమగుచున్నది. మఱియు, కూరేశుల స్వతస్సిద్ధమైన, అంతులేని నైచ్యానుసంధానపరాకాష్ఠకూడ దీనిచే వ్యక్తమైనది. ఈ శ్లోకార్థమును కూరేశులు శ్రీవైకుంఠస్తవమునందు – **"జాన న్నపీహ కిల మా మనపత్రపిష్ణుః విష్ణోః పదప్రణయినీం గిర మాద్రియేఽహమ్, న శ్వావలీఢ మపి తీర్థ మతీర్థ మాహుః నోదన్యతాఽపి చ శునా కిల లజ్జితవ్యమ్"** (నాకు యోగ్యత లేదని తెలిసినను, విష్ణువుయొక్క పాదాల స్తుతిని నా వాక్కులతో చేయాలని ఆశపడుతున్నాను. కుక్క తాగినా గంగాజలాలు అపవిత్రాలు కావని పెద్దలు అంటారు కదా! కుక్కకూడా దాహంగా ఉన్నప్పుడు ఆ నీటిని తాగడానికి అది సిగ్గుపడనక్కరలేదు.) అనుశ్లోకములో సంగ్రహముగా తెలిపిరి.

**(లిహన్)** – లక్ష్మీదేవి కీర్తిని గంగగా, తమను శునకముగా అనుసంధించినందులకు తగినట్లు **"లిహన్"** అను క్రియను కూరేశులు ప్రయోగించిరి. **"లిహ"** ధాతువునకు నాకుట అనునది వాచ్యార్థమైనను, ఇచట నోటితో కీర్తించుట అను లక్ష్యార్థమును గ్రహింపనగును. **"క్షోదీయాన్"** అనగా అత్యంతము క్షుద్రుడు. **"ఈహ–చేష్టాయామ్"** అను ధాతువునుండి పుట్టిన **"అనీహ"** అను పదము ఇచట కైంకర్యమును లక్షించును. లేక, **"ఇచ్ఛాకాంక్షా స్పృహేహాతృడ్వాంఛాలిప్సా మనోరథః"** అను నామలింగానుశాసనమునుబట్టి ఈహా శబ్దము ఇచ్చనుకూడ తెలుపును. కావున, ఇచట **"అనీహః"** అనుటకు ఆసక్తి లేనివాడని భావము.

**“యేఽపి స్యుః పాపయోనయః”, “కుయోనిష్వపి సంజాతః” “హరి ర్హరతి పాపాని దుష్ట చిత్తై రపి స్మృతః, అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః”** (దుష్టబుద్ధులచే అయినా హరినామం స్మరింపబడితే అది వారి పాపాలను హరిస్తుంది. అనుకోకుండా నిప్పు తాకినా అది దహిస్తుంది కదా.) **“సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేళన మేవ వా, వైకుంఠనామగ్రహణ మశేషాఘవినాశనమ్”** ( సంకేతంగానో, పరిహాసంగానో మోసానికో, వేళాకోళానికో అయినా భగవానుని నామాలను స్మరించడం అన్ని పాపాలను హరిస్తుంది) ఇత్యాది పలు ప్రమాణములు ఇచట అనుసంధేయములు. **“నాయేన్ వన్దడైన్దేన్”, “అడినాయేన్”, “నాయేన్, నాన్ శెయ్‌ద కుఱ్ఱమ్”** వంటి దివ్యసూరిసూక్తులను అనుసరించుచు, శునకదృష్టాంతమును కూరేశులు పల్కిరి. **“దుష్యేత్ కిమంఘ్రితటినీ తవ పాదసేవ్యా దుర్వారతర్షచపలేన శునాఽవ లీఢా”** (దేవా! పూజించదగిన గంగానది భరించలేని దాహంవల్ల చపలం అయిన కుక్కచే స్పృశింపబడితే దూషింపబడుతుందా! ఏమి!) అను దేశికుల శరణాగతిదీపికాసూక్తి ప్రకృతదృష్టాంతానుగుణముగా అను సంధేయము– అని వ్యాఖ్యానాంతరము.

ఇంతవరకు కూరేశులు తాము చేయగోరిన లక్ష్మిస్తుతికి ఉపోద్ఘాతమును పల్కి తరువాతి శ్లోకమునుండి స్తుతిని చేయుచున్నారు.

**గార్గ్య :– అతినికృష్టస్యాపి మమ తవాత్యంతపవిత్రకీర్తిస్పర్శనే న భీతిః; న లజ్జాఽపి. హేయప్రత్యనీకతయా తవాపి న మాలిన్యమ్. మమాప్యభిమతప్రాప్తి రిత్యాహ. క్షోదీయానపీతి.**

**క్షుద్రతరోఽపి దుష్టబుద్ధి రపి తామసబుద్ధి రపి, నిస్స్నేహోఽపి దృఢతరస్నేహ రహితోఽపి, అనీహోఽపి ఫలప్రాప్తిపర్యంతోద్యోగరహితోఽపి, లిహన్ ఆస్వాదయన్, అహం న బిభేమి న జిహ్రేమి. తత్ర హేతు రత్రేతి. ఉక్త మర్థం దృష్టాంతముఖేన ఉపపాదయతి. న హీతి. పవిత్రా భాగీరథీ శునా లీఢాపి, న దుష్యేత్ దూషితా భవేత్. కింతు పవిత్రైవ. శునోఽపి న దోషః, కింతు శుద్ధి రేవ. తథా న లజ్జతే. కింతు శ్లాఘైవ. న చ భీతిః పునః పునః ప్రవృత్తి రేవ తృష్ణాశాంతి స్తృప్తిశ్చ. తథా మమాపీతి భావః.**

**6.** ఐశ్వర్యం మహ దేవ వాఽల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్
తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే ।
తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణో
ధన్యం మన్యత ఈక్షణా త్తవ యతః స్వాత్మాన మాత్మేశ్వరః ॥



(లక్ష్మీదేవీ! ) పుంసాం = మానవులకు, సార్వత్రికం = (ఈ లోకము, పైలోకము మొదలగు) అన్నిచోట్ల ఉండతగిన, యత్ = ఏ, ఐశ్వర్యం = విభవము, మహ దేవ వా = పెద్దదిగానో, అథవా అల్పమ్ = లేక, స్వల్పముగానో, దృశ్యేత = కన్పించునో, తత్ = ఆవిభవము, లక్ష్మ్యాః తవ = లక్ష్మీదేవియగు నీ యొక్క, యతః సముదీక్షణాత్ = ఏ కటాక్షవిశేషముచే, వర్తతే = ఉన్నదో, తేన ఏతేన = ఆ ఈ కటాక్షముచే, (కటాక్ష విషయమున), న విస్మయేమహి = ఆశ్చర్యమును పొందము, యతః = ఎందులకనగా, జగన్నాథః = లోకముల కన్నిటికిని ప్రభువై, ఆత్మా + ఈశ్వరః = తనకు తానే ప్రభువైయున్న, నారాయణః అపి = శ్రీమన్నారాయణుడును, తవ = నీ యొక్క, ఈక్షణాత్ = కటాక్షమును పొందుటచే, స్వాత్మానం = తనను, ధన్యమ్ = కృతార్థునిగా, మన్యతే = తలచునుకదా ! (కావున నీ కటాక్షము విషయమున ఆశ్చర్యము లేదు– అని భావము.)

**భావనా :–** లోకములోని ఐశ్వర్యము ఐహికాముష్మికరూపమున ద్వివిధము. ఈ లోకమునందలి ధనధాన్యాదిరూపసంపత్సమృద్ధిని కల్గియుండు స్థితి ఐహికైశ్వర్యము. స్వర్గాది పరమపదాంతములగు పైలోకములందు సామర్థ్యమును కల్గియుండు స్థితి ఆముష్మికైశ్వర్యము. ఈ రెండు విధములైన ఐశ్వర్యములును గురు, లఘుభేదముచే మరల రెండు విధములు. ఈ లోకములో గ్రామాధికారిగానుండు స్థితి లఘువైన ఐశ్వర్యము. చక్రవర్తియైయుండు స్థితి గురువైన ఐశ్వర్యము. ఊర్ధ్వలోకములలో ఇంద్రుడుగా నుండు స్థితి లఘువైన ఐశ్వర్యము. **“శెన్ఱాల్ కుడై యామ్”** ఇత్యాది రీతిలో భగవానునకు సకల కైంకర్యమును చేయువాడైయుండుట గురువైన ఐశ్వర్యము. లక్ష్మీదేవీ! ఇట్టి సకలవిధైశ్వర్యములును నీ కటాక్షఫలముగానే కలుగుచున్నవి – అను ఈ విషయమున కొందఱు ఆశ్చర్యమును పొందిన పొందవచ్చును గాక! కాని, నాకు మాత్రము ఈ విషయమున కొంచెముకూడ ఆశ్చర్యము లేదు. ఎందులకనగా– **“పతిం విశ్వస్యాత్మేశ్వరమ్”** (లోకానికి పతి, తనకు తానే ఈశ్వరుడు) **“నారాయణం పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః”** ఇత్యాదిశ్రుతిశతములచే నిస్సమాభ్యధికుడుగా కీర్తింపబడు సర్వేశ్వరుడగు సాక్షాన్నారాయణుడును – **“నేను లక్ష్మీకటాక్షమునకు పాత్రమగుటచే ధన్యుడనైతిని”** అని తలచునుకదా! అద్వితీయుడైన పరమాత్మనుకూడ ధన్యుని చేయగల నీ కటాక్షము సామాన్యచేతనుల ఐశ్వర్యమునకు హేతువు అనుటలో ఆశ్యర్యమేమున్నది? ఏతావతా ఏమి చెప్పబడినది అనగా– లక్ష్మీకటాక్షము సర్వేశ్వరునకు సైతము ప్రార్థనీయమని.

శ్లోకములోని **“స్వాత్మానమ్”** అనునపుడు ఆత్మ శబ్దమునకు దివ్యాత్మస్వరూపమని, దివ్యమంగళవిగ్రహమనియు అర్థమును చెప్పవచ్చును. **“ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ”** అని అమరము. **“స్వాత్మానం – “సత్యం జ్ఞాన మనంతం**

**బ్రహ్మ", "ఆనందో బ్రహ్మ, రసో వై సః – ఇత్యాదుక్తవైలక్షణ్యస్వరూపాదిక మపి. యద్వా, స్వాత్మానం–ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామి, న తస్య ప్రాకృతా మూర్తిః – ఇత్యాద్యుక్త మహిమస్వదివ్యవిగ్రహం వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

ఇచట **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** అను మొదలగు ప్రమాణములు స్మరణీయములు. **"మన్యతే"** అను వర్తమానకాలికప్రయోగముచే ఈ స్థితి ఈనాటికిని అనువర్తించుచున్నదని సూచింపబడినది. ఈ శ్లోకములోని **"సముదీక్షణాత్"** అను ప్రయోగము యొక్క భావమును శ్రీ పరాశరభట్టర్ శ్రీ గుణరత్నకోశములో **"నయనోదంచన"** శబ్దముతో అనుసంధించిరి. అట్లే, **"అపాంగా భూయాంసః"** అను శ్రీ గుణరత్నకోశశ్లోక భావ మిచట స్మరణీయము.

గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో **"తవ యతః సార్వత్రికం వర్తతే"** అను ప్రయోగము **"ఐశ్వర్యం .....సముదీక్షణాత్"** అను ప్రయోగమును సమర్థించుచున్నదని వ్యాఖ్యానింపబడినది. **"యతః కారణాత్ తవైశ్వర్యం సార్వత్రికం సర్వత్ర వ్యాప్తం వర్తతే. అతః సర్వమప్యైశ్వర్యం త్వదేకదేశ ఇత్యర్థః"** అని అందలి సూక్తి.

**గార్గ్య :– ఇతః పరం స్వాధికారానురూపం లక్ష్మీం స్తౌతిః ఐశ్వర్య మితి. హే లక్ష్మి యదైశ్వర్యం దృశ్యతే తత్, లక్ష్మ్యా స్తవ సముదీక్షణాత్, యతః కారణాత్ తవైశ్వర్యం సార్వత్రికం సర్వత్ర వ్యాప్తం వర్తతే, అతః సర్వమప్యైశ్వర్యం త్వదేకదేశ ఇత్యర్థః. త్వత్కటాక్షమూలేన తేనైతేనైశ్వర్యేణ న విస్మయేమహి. యతః కారణాత్ సర్వేశ్వరోఽపి నారాయణః తవేక్షణాత్ స్వాత్మాన మితరపురుషవత్ ధన్యం మన్యతే. తేనైతేన న విస్మయే మహీత్యర్థః.**

**7. ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌందర్యలావణ్యయోః**
**రూపం య చ్చ హి మంగళం కి మపి యల్లోకే స దిత్యుచ్యతే ।**
**తత్సర్వం త్వదధీన మేవ యదతః శ్రీరిత్యభేదేన వా**
**యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే ॥**

దేవి = లక్ష్మీదేవీ!, అశేషపుంసి = సమస్త చేతనులయందు, యత్ ఐశ్వర్యమ్ = ఏ ఐశ్వర్యము (కలదో), సౌందర్యలావణ్యయోః యత్ ఇదమ్ రూపమ్ = అవయవశోభ అనెడి సౌందర్యము, సముదాయశోభ అనెడి లావణ్యము – అను వీని రూపమేది కలదో, లోకే = లోకములో, యత్ చ మంగళమ్ = మంగళకరమైనది ఏది కలదో, యత్ కిమ్ అపి = (లోకములో) ఏది అయినను, సత్ ఇత్యుచ్యతే = మంచిది అని చెప్పబడుచున్నదో, తత్ సర్వమ్ = ఆ ఐశ్వర్యము, సౌందర్యము, లావణ్యము, మంగళకరము మొదలగునవి



అన్నియును, యత్ = ఏ కారణముచే, త్వత్ అధీనమ్ ఏవ = నీ ఆజ్ఞకు లోబడియున్నవో, అతః = ఇందు వలన, (తత్ సర్వమ్=) అది అంతయు, శ్రీః ఇతి అభేదేన వా = శ్రీ అని అభేదముగానో, (అనగా శ్రీశబ్దముచేతనో), యద్వా = లేక, శ్రీమత్ ఇతి ఈదృశేన వచసా = శ్రీమత్ (సంపదను కల్గినది) అను పదముచే గాని, ప్రథామ్ = కీర్తిని (వ్యవహార మును), అశ్నుతే= పొందుచున్నది.

**భావనా :–** లోకములో ఆయా వస్తువులు, వ్యక్తులు గొప్పతనమును పొందుట, అందమును పొందుట, మంగళకరములుగా నుండుట– అంతయును లక్ష్మీసంబంధము వలననే– అనుట ఇందలి ప్రధానాంశము. ఐశ్వర్యమనగా ఒక వస్తువును కల్గియుండుట. ఇట్టి ఐశ్వర్యము అనునది చీమ అనెడి క్షుద్రప్రాణినుండి, బ్రహ్మ అనెడి ఉన్నతచేతనునివరకు కొంచెమో, ఎక్కువో ఎంతో కొంత ఉండును. చిన్నచీమకంటె పెద్దది ఈగ. దీనికి మించినది తేనెటీగ – ఇట్లు లోకములోని జీవులు ఒకదానికంటె వేఱొకటి గొప్పవిగా నుండును. కావున ఒక్కొక్క ఆత్మకు ఒక్కొక్క రీతిలో ఐశ్వర్యము కలదు. కొన్ని వస్తువులు ప్రతిఅవయవమునందు అందమును కల్గియుండును. అట్లు కాక, కొన్ని వస్తువులలో ప్రత్యేకావయవశోభ లేకున్నను, వాటి అవయవసముదాయమందు ఒక అనిర్వచనీయమైన శోభను అవి కల్గియుండును. ఇట్లు కొన్ని వస్తువులు సౌందర్యమును, మఱికొన్ని లావణ్యమును కల్గినవిగా ఉండును. పసుపు, పుష్పము, దీపము మొదలగు కొన్ని వస్తువులు మంగళకరములుగా లోకములో ప్రసిద్ధి చెందినవి. ఇట్లే, అందమైనవిగా, మంగళ కరములైనవిగా లేకున్నను కొన్ని వస్తువులు సచ్ఛబ్దవాచ్యములైయుండును. ఇట్లు ఆయా వస్తువులు ఇట్టి గొప్పతనమును కల్గియుండుటకు అంతటికిని లక్ష్మీసంబంధమే కారణము. కావున కొన్ని వస్తువులు సాక్షాత్ లక్ష్మీవాచకశబ్దముచే (శ్రీ శబ్దముచే), మఱికొన్ని లక్ష్మీ విశిష్టవాచక (శ్రీమత్) శబ్దముచే వ్యవహరింపబడుచున్నవి. తిరువిళక్కు, తిరుమాళిగై, తిరుమలై మొదలగు వ్యవహారములు శ్రీ అని అభేదము గాను, (శ్రీరిత్యభే దేన అనుటకు ఉదాహరణముగాను) శ్రీమదనంతసరస్సు, శ్రీమద్వనాద్రి – ఇత్యాదివ్యవహారములు. **"శ్రీమదీదృశేనవచసా ప్రథా మశ్నుతే"** అనుటకు ఉదాహరణముగాను గ్రహింపనగును. **"లౌకికచేతనగత – ఐశ్వర్యసౌందర్యలావణ్యమంగళసదాదిశబ్దవాచ్యానాం శ్రీశబ్దేన వాచ్యత్వం త్వత్కటాక్షాయత్తత్వనిబంధనమితి నిష్కృష్టార్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. విష్ణుపురాణములోని **"యతః స త్వం తతో లక్ష్మీః"** (1–9–29) అనెడి శ్లోకమిచట అనుసంధేయమని వ్యాఖ్యానాంతరము. (**"యదతః"** అనునది ఒకే పదముగా, కారణ వాచకముగ గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో చూపబడినది) **"త్వదధీన మేవ త్వత్కటాక్షా ధీనమేవేత్యర్థః"** అని, **"యదతః ఇత్యేకం పదమ్ కారణపరమ్"** అనియు రామానుజాచార్య వ్యాఖ్య.

**గార్గ్య : ఐశ్వర్య మితి. సౌందర్య మవయవశోభా, లావణ్యం సుముదాయ శోభా. రూపం స్వరూపం, మంగళం కల్యాణం, సత్ పవిత్రం వస్తు కిమపి వస్తు త్వదధీనమేవ. త్వత్కటా క్షాధీనమేవేత్యర్థః. యదతః ఇత్యేకంపదమ్ కారణపరమ్. యదతః కారణాత్ ఇత్యర్థః. శ్రీరిత్యభేదేన శ్రీతాదాత్మ్యేన శ్రీమదితి ఈదృశేన వచసా. శ్రీయుక్త మిదమ్ ఇత్యేవం విధేన వచసా, ప్రథాం ప్రసిద్ధిం వ్యవహారం వా, అశ్నుతే ప్రాప్నోతి. తతస్త్వదధీన మిత్యర్థః.**

**8. దేవి! త్వన్మహిమావధి ర్న హరిణా నాఽపి త్వయా జ్ఞాయతే**
**యద్యప్యేవ మథాఽపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే ।**
**యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః**
**వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోఽయ మిత్యుచ్యతే ॥**

దేవి = లక్ష్మీదేవీ ! త్వత్ + మహిమావధిః = నీ గొప్పతనముయొక్క అవధి, హరిణా అపి = భగవానునిచేకూడ, యద్యపి న జ్ఞాయతే = తెలియబడకున్నను, త్వయా అపి = నీచే కూడ, న జ్ఞాయతే = తెలియబడకున్నను, ఏవమ్ అథాపి = ఇట్లు ఎవరిచేతను తెలియబడకున్నను, యువయోః = మీ ఇరువురియొక్క, సర్వజ్ఞతా = సర్వజ్ఞత్వము, న ఏవ హీయతే = ఎంతమాత్రము కొఱతపడుటలేదు (తగ్గుట లేదు), ఎందులకనగా, యత్ = ఏ వస్తువు, నాస్తి ఏవ = (లోకములో) బొత్తుగా లేదో, తదజ్ఞతామ్ = ఆ వస్తువునుగూర్చి తెలియకుండుటను, సర్వజ్ఞతాయాః = సర్వజ్ఞత్వమునకు, అనుగుణామ్= తగినదిగా, విదుః = (విజ్ఞులు) తెలియుదురు, (ఎట్లనగా), వ్యోమ+ అంభోజమ్ = ఆకాశపద్మమును, ఇదంతయా = ఇది అని (ఉన్నది అని), విదన్ = తెలిసికొనుచున్నవాడై, అయమ్ భ్రాంతః = ఇతడు భ్రమించినవాడు, ఇతి = అని, ఉచ్యతే కిల = చెప్పబడుచున్నాడు కదా!

ఈ శ్లోకములోని మొదటిపాదము **"యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వల్లభోఽపి ప్రభుః నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః"** (నిరవధి, నిత్యానుకూలం అయిన నీ మహిమను, నీవల్లభుడు కూడా తన మహిమనువలె, ఇంతటిది అని తెలియలేడు) అనెడి భగవద్యామునకృతస్తోత్రరత్నశ్లోకమును అనుసరించి రచింపబడినది. భగవద్విషయకమగు **"సో అంగ వేద యది వా న వేద"** అను ఉపనిషత్సూక్తి భావము, **"తనక్కుమ్ తన్ తన్మై యతివతియానై"** (తాను సైతం తన స్వభావాన్ని తెలియనివానిని) అను ఆళ్వార్ల సూక్తిభావము లక్ష్మీదేవిపట్ల కవిచే ఇందు అనుసంధింపబడినవి.



**భావనా :–** లక్ష్మీదేవీ! నీ వైభవము నీచేగాని, సర్వజ్ఞుడని పేరొందిన నీ భర్త అగు భగవానునిచేగాని, ఇంతటిది అని పరిచ్ఛేదించి పల్కుటకు సాధ్యము కానిది. అయినను, అంత మాత్రముచే మీ ఇరువురి సర్వజ్ఞత్వమునకు భంగము వాటిల్లదుసుమా! సర్వపదార్థములలో నీ వైభవము అనునదికూడ ఒకటి కదా! దానిని మీరు ఇరువురు తెలియరు – అన్నచో సర్వపదార్థములలో ఒకటియగు నీ మహిమను మీరు తెలియలేదని కదా, అనగా – అజ్ఞత్వముకదా ఏర్పడుచున్నది. అపుడు మీ సర్వజ్ఞత్వమునకు భంగము కల్గుచున్నదే ! అనినచో – అందులకు సమాధానమును ఈ శ్లోకమున ఉత్తరార్ధములో కూరేశులు తెలుపుచున్నారు.

లోకములోనున్న పదార్థములలో దేనినైనను తెలియకున్నచో, అపుడు సర్వజ్ఞత్వమునకు లోపము కల్గునే కాని, ఎంతమాత్రము లేని పదార్థమునుగూర్చి తెలియకుండుట సర్వజ్ఞత్వభంజకము కానేరదు. సరికదా, సర్వజ్ఞత్వమునకు అనుగుణమే అగును. లేని వస్తువును లేదని తెలియుటయే కదా యథార్థజ్ఞానము. కాని, దానిని కల్గియుండుట సర్వజ్ఞత్వమునకు సంగతమగునని కొందఱు భావించిన భావింపవచ్చును. కాని అది సరి కాదు. అట్లు తలచినవారు అవివేకులే అగుదురు. వంధ్యాసుతుడు, కుందేటికొమ్ము, ఎండమావులలో నీరు. ఆకాశపద్మమువంటి బొత్తుగా లేని వస్తువులను ఒకడు ఉన్నవిగా తలచి, **"ఏష వంధ్యాసుతో యాతి శశశృంగధనుర్ధరః, మరీచికాంభసి స్నాతః ఖపుష్పకృతశేఖరః"** (ఎండమావులలోని నీటిలో స్నానమాడినవాడు, ఆకాశపద్మమును తలపై దాల్చినవాడు, కుందేటికొమ్మును దాల్చినవాడగు ఈ గొడ్రాలి కుమారుడు వచ్చుచున్నాడు) అని పల్కినచో, అతడు పిచ్చివారిలో ప్రథముడుగా కదా భావింపబడును. "ఇతడు బొత్తుగా లేని వస్తువులనుకూడ ఉన్నట్లు తెలిసికొన్నవాడగుటచే విశేషజ్ఞాత" అని పొగడబడునా!

ఆవిధముగానే, లక్ష్మీదేవీ! నీ మహిమకు అవధి అనునది, లోకములో ఉన్నవిగా కన్పించుచున్న ఘటపటాదిపదార్థములవలె నిజముగా ఉన్నది అయినచో, దానిని మీరు ఇరువురు తెలియకుండుట మీ సర్వజ్ఞత్వమునకు లోపము కల్గించును. కాని, వాస్తవమునకు నీ మహిమకు అంతు లేకుండుటచే **"త్వన్మహిమావధిః"** అనునది శశశృంగాదులవలె అసత్తు. అనగా – బొత్తిగా లేనిది. అట్టి అసత్పదార్థమును మీరు లేదని తెలియుట యథార్థజ్ఞానమే. అది మీ సర్వజ్ఞత్వానుగుణమే అగును తప్ప, మీ సర్వజ్ఞత్వభంజకము కానేరదు. ఈ అజ్ఞానమును (లేని వస్తువును తెలియకుండునట్టి అజ్ఞానమును) మీరు సర్వజ్ఞత్వబాధకముగా తలచి, దీనిని పోగొట్టుకొనదలచినచో (అనగా– **"త్వన్మహిమావధిః"** అనునది కలదని తలచినచో), మీ సర్వజ్ఞత్వము నశించి, మీరు

"భ్రాంతశిఖామణులు" అను పట్టమే సిద్ధించునుసుమా! అని తాత్పర్యము అని ప్ర.భ. అణ్ణాస్వామి వ్యాఖ్య.

ఏతావతా ఏమి చెప్పబడినది? అనగా – లక్ష్మీదేవి మహిమ అంతు లేనిది అని. **"విద–జ్ఞానే"** అను ధాతువునుండి పుట్టిన **"విదుః"** అను క్రియకు తెలియుచున్నారు – అని వాచ్యార్థమైనను, పెద్దల అభిప్రాయమను తాత్పర్యమును గ్రహింపనగును. **"ఇదంతయా విదన్"** అనగా – ఇది ఆకాశపద్మమని తెలియుట. శ్లోకములో నాల్గవ పాదమున వ్యతిరేకోదాహరణము నిర్దేశింపబడినది. **"వస్తుత ఏవాఽవిద్యమానత్వన్మహిమావధ్యజ్ఞానం సర్వజ్ఞత్వానుగుణ మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"స్వరూపరూపగుణవిభూతీనాం మహిమ్నాం ఉత్కర్షస్యావధిః ఇయత్తయా అవధిః"** అని రామానుజాచార్య వ్యాఖ్య. దేశికుల సర్వార్థసిద్ధిలోని – **"సతః సత్త్వేన, అసతశ్చ అసత్త్వేన శ్రవణ మిహేష్టమ్"** అను సూక్తి అనుసంధేయము– అని వ్యాఖ్యానాంతరము.

**గార్గ్య :– దేవీతి. స్వరూపరూపగుణవిభూతీనాం మహిమ్నా ఉత్కర్షస్యావధి రియత్తయా అవంధ్యపరిజ్ఞానేఽపి సర్వజ్ఞత్వం న హీయత ఇత్యర్థః. తదపరిజ్ఞానం సర్వజ్ఞత్వానుకూలమేవేత్యాహ యదితి. తదేవోపపాదయతి వ్యోమేతి. అత్యంతమ్ అవిద్య మానమ్, గగనకుసుమ మిద మితి విద్యమానతయా విదన్ పురుషో భ్రాంతః; నత్వవిద్యమాన మపి విద్యమానతయా విదన్నిత్యర్థః.**

**9.** **లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం**
**యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి ।**
**సా భారతీ భగవతీ తు యదీయదాసీ**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ॥**

లోకే = లోకమునందు, వనస్పతిబృహస్పతితారతమ్యమ్ = ఒక జీవుడు వృక్షము వలె జడునిగా, వేఱొకడు బృహస్పతివలె మహావిద్వాంసుడుగా జన్మించుటలోని తారతమ్యమును, యస్యాః = ఏ సరస్వతీదేవియొక్క, ప్రసాదపరిణామమ్ = అనుగ్రహము యొక్క పర్యవసానముగా, ఉదాహరంతి = (జ్ఞానులు) పల్కుదురో, భగవతీ = పూజ్యురాలగు, సా = ఆ, భారతీ = సరస్వతీదేవి, యదీయదాసీ = ఏ లక్ష్మీదేవియొక్క దాసియో, దేవదేవమహిషీమ్ = దేవదేవుని మహిషియగు, తాం = ఆ, శ్రియం = లక్ష్మీదేవిని, ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

**భావనా :–** లక్ష్మీదేవి అనుగ్రహమును పొందినవారిపట్ల సరస్వతియు దాసాను దాసురాలు అగునని పల్కుట ఇందలి ప్రధానాంశము.



**"కవై యాకి క్కొమ్బాకి క్కాట్టకత్తే నిఱ్కుమవ్వల్ల నల్ల మరజ్గళ్, శవై నడువే నీట్టోలై వాశియా నిన్ఱాన్ కుఱిప్పుఱియ మాట్టాదవన్ నన్మరమ్"** (అరణ్యంలో శాఖోపశాఖలుగా పెరిగి నిలిచేవి కావు నిజమైన వృక్షాలు. సభ నడుమ చదవబడే పత్రంలోని తాత్పర్యాన్ని గ్రహించలేనివాడే వృక్షం) అనునట్లు వృక్షసదృశులని తెగడబడు మూఢులై కొందఱుండుట, దేవగురువగు సాక్షాత్ బృహస్పతియొక్క అపరావతారమని పొగడబడు బుద్ధిమంతులుగా కొందఱుండుటయును సరస్వతీదేవికటాక్షముయొక్క సద్భావ – తదభావముల కారణమువలననేకదా! ఇది లోకమంతట ప్రసిద్ధమైన విషయము. ఇట్టి వైభవమునుకల సరస్వతియు లక్ష్మీకటాక్షమును పొందినవారి ద్వారమువద్ద దాసురాలై, వారికి కైంకర్యమును చేయునదియై యుండుటచే, అట్టి మహిమను కల లక్ష్మీదేవిని శరణు పొందుచున్నాను – అని భావము.

పూర్వము రెండవ శ్లోకములో **"యుక్తాం భావయ భారతీమ్"** అనుచు లక్ష్మీదేవిని ఉద్దేశించి తమకు వాక్సమృద్ధిని కల్గింపుమని ప్రార్థించిన కూరేశులను చూచి కొందఱు "మీరు ఇట్లు వాగ్వైభవముకొఱకు లక్ష్మీదేవిని ప్రార్థించినచో ఏమి ప్రయోజనము కల్గును? సరస్వతీదేవికదా దానిని అనుగ్రహింపగల్గినది ? అందుచే, ఆ సరస్వతినిగూర్చి స్తోత్రమును చేయుటయే తగినది – అని పలుకగా, వారికి సమాధానముగా ఈ శ్లోకము అవతరించెనని చెప్పనగునని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. మీరు వాగ్దేవత అనుచు కీర్తించు సరస్వతియే లక్ష్మీదేవికి దాసురాలు అయిన పిమ్మట, నేను ఆ లక్ష్మీదేవిని విడచి, సరస్వతీదేవిని ఆశ్రయించుట తగినది కాదుకదా – అని కూరేశులిందు సూచించిరి.

**"ప్రసాదపరిణామఫలమ్"** అని పలుకవలసియుండగా, **"ప్రసాదపరిణామమ్"** అని పల్కుట కార్యే కారణోపచారప్రయోగము. **"సంసారసింధుతరణం భగవత్ప్రసాదః"** (సంసారమనే సముద్రాన్ని దాటించేది భగవానుని అనుగ్రహం) అనునట్టిదే ఇదియును. **"యదీయదాసీ"** అనునపుడు **"యస్యాః ఇమే యదీయాః, యదీయానాం దాసీ యదీయదాసీ"** అను వ్యుత్పత్తిని గ్రహించుటద్వారా లక్ష్మీదాసులకు దాసురాలు అను భావము ఏర్పడును. **"దేవదేవమహిషీ"** – **"దేవానా మపి దేవః దేవదేవః, తస్య మహిషీ దేవదేవమహిషీ, తామ్"** అను విగ్రహమును ఇచట చెప్పనగును.

**"అర్థో విష్ణు రియం వాణీ"** అను పరాశరమహర్షి విష్ణుపురాణసూక్తి, **"నతాః స్మ సర్వవచసాం ప్రతిష్ఠా యత్ర శాశ్వతీ"** అను శౌనకవచనమును ఇచట స్మరింపనగును. అట్లే, **"సర్వవాగీశ్వరేశ్వరః"** అను నామమును, **"ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః, పద్మే! తాసాం పరిణతి రసౌ భావలేశై స్త్వదీయైః"** అను దేశికుల శ్రీస్తుతి శ్లోకమును అనుసంధేయములని – వ్యాఖ్యానాంతరము.

**గార్గ్య : లోకేతి. అజ్ఞానావధి ర్వనస్పతిః సర్వజ్ఞావధిః బృహస్పతి ర్యస్యా భారత్యాః ప్రసాదస్య న్యూనాధికభావేన పరిణామః.**

**10. యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన**
**సద్యః సముల్లసితపల్లవ ముల్లలాస ।**
**విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ॥**

ప్రాక్ = పూర్వము (ప్రళయకాలములో), విపర్యయసముత్థవిపర్యయం = లక్ష్మీకటాక్షము పొందకపోవుటవలన వాడిపోయిన, విశ్వమ్ = జగత్తు, యస్యాః = ఏ లక్ష్మీదేవియొక్క, కటాక్షమృదువీక్షణదీక్షణేన = కటాక్షములతో మెల్లగా చూడవలెనను సంకల్పముచే సద్యః = ఆ సంకల్పము కల్గిన క్షణములోనే, సముల్లసితపల్లవమ్ = ఉద్భవించిన చిగురును కల్గినదిగా, ఉల్లలాస = విలసిల్లెనో, దేవదేవమహిషీమ్ = దేవ దేవుని మహిషియగు, తాం = ఆ, శ్రియం = లక్ష్మీదేవిని, ఆశ్రయామః = ఆశ్రయించు చున్నాము.

**భావనా :–** ప్రళయకాలములో సకలాత్మవర్గము కరణకళేబరములను లేనిదియై, ఱెక్కలు తెగిన పక్షివలె ఏ ప్రవృత్తికిని యోగ్యత లేనిదియై పడియుండి, అసత్తువలెనున్న దశలో నుండగా– "ఈ ఆత్మవర్గమంతయు ప్రవృత్తిక్షమము కావలయును" అని తలచిన లక్ష్మీదేవి, ఆత్మవర్గమును అంతటిని చల్లగా కటాక్షింపప్రయత్నించిన మఱు క్షణములోనే అంతయు తిరిగి చిగుర్చినట్లు వికాసమును పొందినదో, అట్టి లక్ష్మీదేవిని శరణు పొందుచున్నాను–అని భావము. అసత్తువలె పడియున్నను నీవు చల్లగా కటాక్షించి, సద్గోష్ఠిలో నన్ను అన్వయింపజేయవలెనని ప్రార్థించుట కవి హృదయము.

ప్రళయకాలములో లక్ష్మీదేవి కటాక్షములతో విశ్వమంతయు సముల్లసితమగుట అనగా– ఈ స్తుతిలోని మొదటి శ్లోకములో అనుగ్రహించిన రీతిలోను, **"ప్రళయ సమయసుప్తం స్వం శరీరైకదేశం వరద! చిదచిదాఖ్యం స్వేచ్ఛయా విస్సృజానః, ఖచిత మివ కలాపం చిత్ర మాతత్య ధూన్వన్ అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్"** (వరదా! ప్రళయసమయమున నిద్రపోయినట్లుండు, నీకు చెందిన నీ శరీరములోని ఒకభాగము అయిన చిదచిత్తులను పేరు గల ప్రకృతి, జీవులను స్వేచ్ఛగా విస్తరింపజేయుచు, ఆడ నెమలి ఎదురుగా ఆశ్చర్యకరముగా పింఛాన్ని ఆకాశములో ఉన్నట్లుగా విప్పి, తిప్పుతూ ఆడే మగనెమలివలె, లక్ష్మీసమక్షంలో క్రీడిస్తున్నావు) అని శ్రీరంగరాజస్తవ ఉత్తర శతకములో, **"కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్యమాలింగతోః భూతాహం కృతిబుద్ధిపంచకరణీస్వాంతఃప్రవృత్తీంద్రియైః, అండానావరణై స్సహస్ర మకరో త్తాన్ భూర్భువ స్స్వర్వతః శ్రీరంగేశ్వరదేవి! తే విహృతయే సంకల్పమానః ప్రియః"** (లక్ష్మీదేవీ! యోగ్యమైన కాలం వచ్చినపుడు చిదచిత్తులను అన్యోన్యం కలిసేటట్లుగా సంకల్పించిన నీ ప్రియుడు నీ విహారంకోసం పంచభూతాలు, అహంకారం, మహత్తు, అయిదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, అయిదుకర్మేంద్రియాలు – అనే వీటితో ఏడు ఆవరణలను కల భూర్భువస్సువర్లోకాలను కల బ్రహ్మాండాలను వేలాదిగా సృష్టించాడు) అని శ్రీగుణరత్న కోశములో పరాశర భట్టర్ రచించిన రీతిలోను ఈమె కనుసన్నలలో **"కరణకళేబరైః ఘటయితుం దయమానమనాః"** (కరణకళేబరాలతో కూర్చాలని కరుణతో కూడిన మనస్సు కలవాడై) అనునట్లు దయానిధి అగు భగవానుని కృపవలన కరణకళేబరములను పొందుటయే. ఇట్టి యోజనను తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ **"ఈషత్వత్.....అనంతోదయమ్"** అను చతుఃశ్లోకసూక్తిని వివరించుచు అనుగ్రహించినట్లు పెరియవాచ్చాన్ పిళ్ళై తమ చతుః శ్లోకీ వ్యాఖ్యలో అనుగ్రహించిరి. **"విపర్యయసముత్థ"** అను విశేషణము జగత్తును ఉల్లసింపచేయుటలో లక్ష్మీకటాక్షమునకు కల నియతములైన అన్వయవ్యతిరేకములను – అనగా లక్ష్మీకటాక్షమున్ననే లోకము పల్లవితమగుట, లేకున్నచో కాకుండుట అను నియమములను వ్యక్తీకరించుచున్నది. **"కటాక్షమృదువీక్షణ"** మనగా సముద్రమును గోష్పాదములో ఇమిడ్చినట్లు, ఒక్కసారి ఆ కటాక్షములు పెల్లుబికి ముంచెత్తుటకాక, మెల్ల మెల్లగా పరిపూర్ణముగా కటాక్షించుట– అని అర్థము. లేనిచో జీవునకు ఆ కటాక్షోద్ధృతిని భరించుటకు సాధ్యము కాదుకదా! కటాక్షింపవలెనను సంకల్ప మాత్రముచేతనే జగత్తు అంతయు సముల్లసితపల్లవమగు చున్నదనినచో, ఇక పూర్ణముగా కటాక్షించినచో ఎట్టి ఫలము కల్గునో ఊహింపలేముకదా! దీనివలన లక్ష్మీకటాక్షము, భగవత్కటాక్షమువలెనే, నిస్సమాభ్యధికవైభవశాలి అని ఏర్పడుచున్నది. ఈ శ్లోకము భగవద్యామునముని ప్రణీతమగు చతుఃశ్లోకిలోని **"ఈషత్త్వత్కరుణా నిరీక్షణసుధా సంధుక్షణా ద్రక్ష్యతే నష్టం ప్రాక్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్"** (ముల్లోకాలు కొద్దిపాటి నీ కరుణాకటాక్షాలనే అమృతంయొక్క సంబంధంతో రక్షింపబడుతున్నది. పూర్వం ఆ కరుణ లేనందువల్ల నశించింది. ఇపుడు అనంతమైన అభ్యుదయాన్ని పొందినది) అనెడి సూక్తిభావమును అనుసంధించుచున్నదనుట స్పష్టము.

ఈ శ్లోకభావమును వేఱొక రీతిలోకూడ అన్వయింపవచ్చుననుచు కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు ఇట్లు వివరించిరి – "దుర్వాసశ్శాపవశముచే లక్ష్మీదేవి ముల్లోకములను సంపద్విరహితములగునట్లు త్యజించి, క్షీరాబ్ధిలో చేరినపుడు, ఆమె కటాక్షములు లేకుండుటచే భువనములన్నియు **"అసన్నేవ"** అను రీతిలో నష్టప్రాయములైనవి. పిమ్మట

దేవాసురులు క్షీరాబ్ధిని చిలుకగా, **"క్షీరోదాచ్ఛ్రీ సముత్పన్నా శ్రూయతేఽ మృతమంథనే,"** (అమృతమథన సమయంలో లక్ష్మీదేవి పాలసముద్రంనుండి పుట్టిందని వింటున్నాము) అనియు, **"శెఴుఙ్కడలముతిన్ పిఱన్దవళుమ్"** (గంభీరమైన పాలసముద్రంనుండి పుట్టినది) అనియును పల్కు రీతిలో **"అముతిల్ వరుమ్ పెణ్ణముదు"** అని కీర్తింపబడునట్లు అందుండి అవతరించిన లక్ష్మీదేవి – **"దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా, పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"** (స్నానం చేసినదై, దివ్యమైన పూ మాలికలను, వస్త్రాలను ధరించినదై, భూషణాలచే అలంకరింపబడినదైన లక్ష్మీదేవి దేవతలందరు చూస్తూ ఉండగా హరివక్షస్సును చేరింది) అనునట్లు స్నాతయై, మహార్ఘమగు వస్త్రమును దాల్చినదియై, చిత్రమాల్యములను దాల్చి లేపనములను పూసికొన్నదై, **"తికఴ్కిన్ఱ తిరుమార్బిల్"** (ప్రకాశించే వక్షస్సులో) అనునట్లు ప్రకాశించు భగవద్వక్షస్సులో **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణంకూడా విడిచి ఉండలేను) అనుచు చేరిన పిదప, తన కరుణాశీతలకటాక్షములనెడి అమృతవర్షముతో జగత్తును అభిషేకింపగా, అపుడు లోకములన్నియు తిరిగి సత్తను పొంది, సర్వసమృద్ధములైన వృత్తాంతమును **"నష్టం ప్రాక్ . . . సంప్రత్యనంతోదయమ్"** అను ప్రయోగము ధ్వనింపజేయుచున్నది – అను వివరణమును చతుఃశ్లోకివ్యాఖ్యలో నాయనార్ ఆచ్చాన్ పిళ్ళై అనుగ్రహించుటనుబట్టి, ప్రకృతశ్లోకములోని **"ప్రాక్"** అను పదమునకును – దుర్వాసశ్శాపవశముచే జగత్తు అంతయు సంపదను కోల్పోయిన ఆ సమయమున – అను అర్థమును చెప్పవచ్చును. శ్రీదేశికులును చతుఃశ్లోకీభాష్యములో **"ప్రాక్ – తదుపేక్షాకాలే . . . సంప్రతి – తతోఽ వలోకితా దేవాః – ఇత్యాద్యుక్తా అయం త్వన్నిరీక్షణదశాయామ్, అనంతోద యమ్– పూర్వకాలాదప్యతిశయితాభ్యుదయ మిత్యర్థః. ఉక్తం హ్యేతత్ సర్వ మింద్రేణ– "త్వయా దేవి! పరిత్యక్తం సకలం భువనత్రయమ్, వినష్టప్రాయ మభవత్ త్వయే దానీం సమేధితమ్ – ఇతి"** అని పల్కుటనుబట్టి ఈ అన్వయము దేశికులకును అభిమతమేనని తెలియుచున్నది. **"ప్రాక్"** అను పదమునకు, సంహారకాలమున– అను అర్థమును చెప్పినచో,సంహారము దయాస్వరూపిణియగు లక్ష్మీదేవి ప్రకృతికి అనుగుణము కాదు కావున, దుర్వాసశ్శాపవృత్తాంతమును చెప్పుటయే తగినదని వ్యాఖ్యానించినవారును కలరు. కాని, సంహారముకూడ ఒక విధమైన దయాకార్యమేనని అభిజ్ఞుల అభిప్రాయము. మందులకు తీరని రోగము వచ్చినపుడు, శస్త్రచికిత్స చేసి, దుష్టాంగమును వైద్యుడు తొలగించుటయును దయాకార్యమేకదా ! అట్లు, జీర్ణమై, వ్యాధిగ్రస్తమైన శరీరరమునుండి జీవుని వేఱుచేసి రక్షించుటవంటి లయమును దయాకార్యమే. కావున, ప్రళయ సమయమున– అను అర్థమును **"ప్రాక్"** అను పదమునకు చెప్పుటలో ఏ విరోధమును లేదు.



**గార్గ్య :– యస్యా ఇతి. మృదువీక్షణం మందవీక్షణమ్, తదేవ దీక్షణం రక్షాదీక్షమ్, సముల్లసితపల్లవం సముల్లసితాంకురమ్. సముల్లసితోదయమితి యావత్. ప్రళయ దశాయాం దుర్వాసశాపేనామృతమథనాత్ పూర్వం త్రైలోక్యశ్రీతిరోధానదశాయాం వా కటాక్షవిపర్యయేణ సముద్భూతవిపర్యయమ్.**

## 11. యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశాః స్యుః । శ్రీరంగరాజమహిషీ సా మా మపి వీక్షతాం లక్ష్మీః ॥

యస్యాః = ఏ లక్ష్మీదేవియొక్క, కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితాః = కడగంటి చూపులకు క్షణకాలము లక్ష్యముగా చేయబడినవారు. మహేశాః స్యుః= గొప్ప కైంకర్యమను ఐశ్వర్యమును కలవారుగా అగుదురో, శ్రీరంగరాజమహిషీ = శ్రీరంగనాయకి అనెడి, సా = ఆ లక్ష్మీదేవి, మామ్ అపి = దాసుడనగు నన్నుకూడ, వీక్షతామ్ = కటాక్షించునుగాక !

**భావనా :–** ఇందు సమస్తైశ్వర్యమునకును లక్ష్మీకటాక్షమే కారణమనుచు కూరేశులీస్తుతిని ముగించుచున్నారు. ఏ లక్ష్మీదేవియొక్క కటాక్షవీక్షణము క్షణకాలము పడినవారు ధన్యులగుదురో, అట్టి మహామహిమశాలినియగు, శ్రీరంగనాయకిరూపములో నున్న లక్ష్మీదేవి దాసుడనగు నన్నుకూడ కటాక్షింపవలెను – అని భావము.

**"క్షణలక్షమ్"** అను వేఱొక పాఠముకలదు. ఇదియును అర్థవంతమే. **"లక్షం లక్ష్యం శరవ్యం చ"** అని అమరము.

**(మహేశాః స్యుః)** – ఇచట చెప్పబడిన మహేశత్వము ఐహికమైన, అత్యంతాల్పమైన ఐశ్వర్యము కాదు. కుబేరుని సంపదను మించిన సంపదను సైతము తృణీకరించుటచే **"పొన్ వట్టిల్తనై యెఱిన్ద పుకఴుడైయాన్ వాழியే"** (బంగారు గిన్నెను పారవేసిన కీర్తిని కలవారు వర్ధిల్లాలి) అని కీర్తింపబడునట్టి పరమవిరక్తులు, కేవలము ఉంఛవృత్తితో జీవనమును సాగించిన కూరేశులకు అత్యంతాస్థిర అల్పమగు సంపదలో ఉద్దేశ్యము ఉండుటకు ప్రసక్తియే లేదుకదా ! అందుచే ఇచటి మహేశశబ్దము స్వరూపానురూపమైన కైంకర్యసమృద్ధిని కలవారిని నిర్దేశించును– అని చెప్పుటయే సబబు. **"స తు నాగవరః శ్రీమాన్"** (కైంకర్య లక్ష్మిని కల ఆ గజేంద్రుడు) అని గజేంద్రుని శ్లాఘించుట, రావణునిచే **"త్వాం తు ధిక్! కులపాంసనమ్"** (ఛీ! కులపాంసనుడవైన నిన్ను) అని బహిష్కృతుడై, శరణ్యుడగు శ్రీరాముని ఆశ్రయించుటకై **"త్యక్త్వా పుత్రాం శ్చ దారాం శ్చ"** (పుత్రులను, భార్యను వదలి) అనునట్లు సమస్తమును త్యజించి, ఆకాశమున నిలచిన విభీషణుని **"అంతరిక్షగతః శ్రీమాన్"** (అంతరిక్షాన్ని చేరిన, కైంకర్యలక్ష్మిని కల విభీషణుడు) అని

కీర్తించుట, **"కువలయత్తుమ్ కరియుమ్ పరియు మిరాచ్చియమము మెల్లామ్ తుఱన్దు"** (భూమిని, ఏనుగులను, గుఱ్ఱాలను, రాజ్యాన్ని అన్నిటినీ వదలిపెట్టి) అనునట్లు ఐహికసంపదల నన్నిటిని త్యజించి, **"ఖనిత్రపిటకాధరః"** (తవ్వుగోలను, బుట్టను ధరించిన వాడు) అనునట్లు శ్రీరాముని సేవకు తగిన సాధనములను గైకొని, అరణ్యమునకు పోవు లక్ష్మణుని **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** అని పొగడుటయును భగవత్కైంకర్యమే గొప్ప సంపద అను భావముతోకదా! ఇట్టి సంపద ఈ లోకములో అర్చావతారములలో లభింప వలెనన్నను, పరమపదములో లభింపవలెనన్నను, లక్ష్మీకటాక్షము లేనిదే వీలుకాదు – అను విషయము **"పఙ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డు నిన్ కోయిల్ శీయ్‌త్తు"** (పంకజవాసిని అయిన లక్ష్మీదేవి కృపతో నీ కోవెలను ఊడ్చి) అని, **"పూవళరుమ్ తిరుమకళాల్ అరుళ్ పెఱ్ఱు ప్పొన్నులకిల్ పొలివర్ తామే"** (లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొంది పరమపదంలో గొప్పగా జీవిస్తారు) అని మొదలగుగాగల దివ్యసూరి సూక్తులవలన, **"శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్"** (లీలావిభూతిలో కాని నిత్యవిభూతిలో కాని జీవులకు లక్ష్మీదేవి అనుగ్రహం లేకపోతే శ్రేయస్సుకల్గుతుందని భావింపబడడం లేదు) ఇత్యాది పూర్వచార్య సూక్తులవలన విశదమగుచున్నది. లక్ష్మీదేవి అనుగ్రహము లేకుండ భగవానుని పొందదలచినవారు పొందు ఫలమునకు శూర్పణఖను ఉదాహరణముగా మన పూర్వాచార్యులు పేర్కొనిరి. **"శ్రీరంగరాజమహిషీ సా"** అను సామానాధికరణ్యముద్వారా శ్రీరంగనాయకి అనెడి అర్చారూపమునకు, **'సా'** అను పరోక్షశబ్ద నిర్దేశముచే చెప్పబడు పరరూపమునకు ధర్మైక్యము, భగవానుని విషయములోవలె చెప్పబడినదని వ్యాఖ్యానాంతరము.

ఇక మహేశశబ్దమునకు మహేశ్వరుడను అర్థమును గ్రహించి, **"శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరామ్"** (సంపత్కరం అయిన నీ కొద్దిపాటి కటాక్షంచేత బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు తమ తమ ఐశ్వర్యాలను పొందారు) అనునట్లు మహేశాది దిక్పాలకులందఱు లక్ష్మీప్రసాదమువలననే ఆయా ఐశ్వర్యములను పొందిరని వివరించువారును కలరు. ఇందులకు అనుగుణముగా దేశికుల గద్యభాష్యములోని – **"యదాహ కాశ్యపః – బ్రహ్మాద్యాః మునయ స్సర్వే మునయ శ్చ తపోధనాః, ఏధంతే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి" ఇతి. మంకణసంహితాయాం చాష్టానా మపి లోకపాలానాం తత్పూజానిరతత్వం చ ప్రపంచితమ్ ద్రష్టవ్యమ్,** అను సూక్తిని, శ్రీసూక్తభాష్యములో ఉదాహరింపబడిన, ఆయా దిక్పాలకులు లక్ష్మిని ఆరాధించుటను తెలుపు **"శ్యామః కిరీటీ దేవేశో వజ్రభృ ద్విశ్వనందనః శ్రీపూజానిరతో భోగీ యోఽసౌ పుష్ణాతు మే శ్రియమ్, . . . శుద్ధస్ఫటికసంకాశః శూలీ లోకైకనాయకః, విష్ణుదేవ్యర్చనపరో**



**హరః పుష్ణాతు మే శ్రియమ్"** (నల్లనివాడు, కిరీటాన్ని కలవాడు, దేవతలకు ప్రభువు, వజ్రాన్ని ధరించినవాడు, లోకాల ఆనందింపజేసేవాడైన ఇంద్రుడు లక్ష్మీ పూజానిరతుడై భోగాలను అనుభవిస్తున్నాడు. అతడు నా సంపదను వృద్ధిచేయాలి....శుద్ధమైన స్ఫటికం వంటివాడు, శూలాన్ని కలవాడు, లోకైకనాయకుడు, విష్ణువు అర్చనలో తత్పరుడు అయిన హరుడు నా సంపదను వృద్ధిచేయాలి) అను మొదలగు శ్లోకములును అనుసంధేయములు. బ్రహ్మదేవుని ఐశ్వర్యము సైతము లక్ష్మ్యధీనమనుటను బ్రహ్మపురాణగతమగు **"పద్మయోని రిదం ప్రాప్య పఠన్ స్తోత్రం తతః క్రమాత్, దివ్యం చాష్టగుణైశ్వర్యం త్వత్ప్రసాదాచ్చ లబ్ధవాన్"** (నాభీపద్మంనుండి పుట్టిన బ్రహ్మ ఈ స్తోత్రాన్ని పొంది, అనుసంధిస్తూ దానివల్ల క్రమంగా దివ్యమైన, అష్టగుణమైన ఐశ్వర్యాన్ని నీ అనుగ్రహంవల్ల పొందాడు) అను ప్రమాణము తెలుపుచున్నది.

**(సా మా మపి వీక్షతాం లక్ష్మీః)** – దాసుడనగు నన్నుకూడ కటాక్షించి, ఆ భగవత్కైంకర్యమను సంపదను ఇవ్వవలెను– అని భావము. ఆర్యతమయగు లక్ష్మీదేవి స్తుతిని ఆర్యావృత్తముతో పూర్తిచేయుట సందర్భోచితముకదా! ఈ స్తుతి లోని మొదటి 8 శ్లోకములు శార్దూలవిక్రీడితములు, తరువాత రెండును వసంతతిలకవృత్తములు. చివరిది ఆర్యావృత్తము.

**వ్యాఖ్యా శ్రీస్తవస్యేయం భావనా శ్రీశపాదయోః ।**
**అర్పితా శింగరార్యేణ ప్రకల్పేత సతాం ముదే ॥**

**అచింత్యదివ్యాద్భుతసద్గుణౌఘ–**
**శ్రీకూరనాథాఖ్యగురూత్తమానామ్ ।**
**స్మృతిః సహస్రాబ్దిమహోత్సవస్య**
**శ్రీస్వామిదాసేన ప్రకాశితైషా ॥**

**గార్గ్య :– యస్యా ఇతి. స్తోత్రం సమాపయతి. క్షణలక్ష్యం యథా భవతి తథా లక్షితాః. మహేశాః జగతా మధీశ్వరాః.**

**శ్రీగార్గ్య : రామానుజార్యవిరచితం శ్రీవత్సాంకమిశ్రకృతశ్రీస్తవవ్యాఖ్యానమ్ సంపూర్ణమ్.**

**వేంకటాచార్యశిష్యేన రామానుజవిపశ్చితా ।**
**సంగ్రహో శ్రీస్తవవ్యాఖ్యా యథామతి వినిర్మితా ॥**